శాశ్వతములైన; తే-నీయొక్క; అపకీర్తిం-అపకీర్తిని; కథయిష్యంతి-చెప్పుకొనగలరు; చ తథాహి-అదియుక్తమేకదా; సంభావితస్య-శౌర్యధైర్యాది గుణములచే సన్మానించబడినవానికి; అపకీర్తిః-అపకీర్తి; మరణాచ్చ-చావుకంటె; అతిరిచ్యతే-అధికమగుచున్నది.

ఇదిగాక సమస్తభూతములును యిక బహుకాలము వరకు నీ యపకీర్తిని చెప్పుచుండును. గౌరవముగలవానికి మరణముకన్నను యపకీర్తియే అధికము.

భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః।
ఏషాంచత్వాం బహుమతో భూత్వా యాస్యసి లాఘవం.

ఏషాం-ఏదుర్యోధనాదులకు; త్వం-నీవు; బహుమతః-శౌర్యధైర్యాదిగుణములచేబహుమానితుడవైతివో; మహారథాః-మహారథికులైన; తే-ఆదుర్యోధనాదులు; త్వాం-నిన్ను; భయాత్-భయమువలన; రణాత్-యుద్ధమువలన; ఉపరతం-నివృత్తిబొందిన వానిగా; మంస్యంతే-తలంచగలరు; బహుమతః-పూర్వమందు బహుమానము చేయబడినవాడవు; భూత్వా-అయి, లాఘవం-పిమ్మట చులకదనమును; యాస్యసి-పొందగలవు.

శూరులగు కర్ణదుర్యోధన ప్రభృతులును నిన్ను భయము

చే యుద్ధమునుండి తొలగినవానిగా దలంతురు. నిన్నాదివరకు ఎవరు మిక్కిలి గౌరవించిరో వారలంచరు యిక చులకనగా చూతురు.

అవాచ్య వాదాం శ్చబహూన్వదిష్యంతి తవాహితాః।
నిందంత స్తవ సామర్థ్యం తతోదుఃఖ తరన్నుకిం. 36.

తవ-నీయొక్క; సామర్థ్యం-సామర్థ్యమును; నిందంతః-దూషించుచున్న; తవ-నీయొక్క; అహితాః-శత్రువులయిన ధార్తరాష్ట్రులు; బహూన్-అనేకములయిన, అవాచ్యవాదాన్-పలుకదగనిపలుకులను; వదిష్యంతి-చెప్పకొనంగలరు; తతః-అంతకంటె; దుఃఖతరం-మిక్కిలి దుఃఖము; కిన్ను-ఏమియున్నది.

నీ శత్రువులు నీనాదివరకు అచ్చటచ్చట చూపిన సామర్థ్యముల నిందించుచూ నీవిషయమయి జెప్పరానిమాటలజెప్పుదురు. అంతకన్న అధిక దుఃఖము ఏమికలదు?

హతోవా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావాభోక్ష్య సేమహీం।
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 37.

హే కౌంతేయ-ఓయి అర్జునుడా; హతోవా-యుద్ధమందు శత్రువులచేత జంపబడినవాడవైతివేని; స్వర్గం-స్వర్గమును; ప్రాప్స్యసే-పొందగలవు; జిత్వావా-వారలజయించినవా

డవయితివేని; మహీం- భూజాతభోగములను; భోక్ష్యసే-అను
భవించగలవు; తస్మాత్ - ఆకారణమువలన; యుద్ధాయ-యుద్ధ
మునకొఱకు; కృతనిశ్చయస్సన్- కృత- చేయబడిన; నిశ్చయ
స్సన్- శత్రువులజయింతు నను నిశ్చయముగల వాడవయి; ఉ
త్తిష్ఠ- లెమ్ము.

ఇక యుద్ధముజేసినచో హతుడవగుదువేని స్వర్గము పొందు
దువు. జయింతువేని రాజ్యమనుభవింతువు. అందువల్ల ఓఅర్జు
నుడా యుద్ధముచేయ నిశ్చయించినవాడవై లెమ్ము.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. ౩౮.

సుఖదుఃఖే-సుఖదుఃఖములను; సమే- సమానములుగా; కృ
త్వా-చేసి; లాభాలాభౌ- సుఖదుఃఖముల వలన గలిగెడి లాభా
లాభములను; జయాజయౌ- జయాపజయములను; సమౌ-సమ
ములుగా; కృత్వా-చేసి; తతః-ఆపిమ్మట; యుద్ధాయ-యుద్ధము
కొఱకు; యుజ్యస్వ-ఆయత్తుడవగుము; ఏవం చేత్- ఇట్లు యుద్ధ
ము చేసితివేని; పాపం-పాపమును; నావాప్స్యసి- పొందవు.

సుఖదుఃఖములను లాభనష్టములను జయపరాజయములను
సమముగా నెంచి అటుపిమ్మట యుద్ధముచేయ పూనుము. అట్లు
చేయుదువేని పాపమును పొందవు.

అవతారిక. అందుకు సాధన భూతమైన కర్మయోగమును జెప్పుచున్నాడు.

ఏషా౽భిహితాసాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాంశృణు।
బుద్ధ్యా యుక్తోయయాపార్థ కర్మబంధం ప్రహాస్యసి. 39.

హేపార్థ - ఓయి అర్జునుడా; సాంఖ్యే-ఆత్మతత్త్వసంగతి ఏషా-ఈప్రతిపాదింపబడిన; బుద్ధి -బుద్ధి; తే-నీకు; అభిహితా-చెప్పబడెను; యోగేతు-యోగవంతుడైతె; ఇమాం- ఈబుద్ధిని; శృణు-వినుము; యయాబుద్ధ్యా-ఏబుద్ధితోడ, యుక్తస్సన్-కూడినవాడవై; కర్మబంధం- కర్మబంధమును; ప్రహాస్యసి- విడువగలవో.

ఓ అర్జునుడా! ఇది ఆత్మ తత్త్వజ్ఞానము యిప్పుడు చెప్పితిని. ఇక కర్మయోగ జ్ఞానమును నీకు చెప్పెదను వినుము. ఈ కర్మయోగవిషయమైన జ్ఞానముతో కూడిన వాడు కర్మబంధమును వదలును.

నేహాభిక్రమనాశో౽స్తి ప్రత్యవాయో నవిద్యతే।
స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతేమహతోభయాత్. 40.

ఇహ- ఈ కర్మయోగమందు; అభిక్రమనాశః- ఆరంభనాశనము; నాస్తి-లేదు; ప్రత్యవాయః- ప్రత్యవాయమును; నవిద్యతే- లేదు, అస్యధర్మస్య-యీ యోగముయొక్క; స్వల్పమ

పి- ఉపక్రమమాత్రమైనను; మహత్ - అధికమయిన; భయాత్ -సంసారభయమువలన; త్రాయతే- రక్షించుచున్నది.

ఈ కర్మయోగము నందు ఆరంభించుటలో కష్టమేమియు లేదు ప్రత్యవాయమును లేదు. ఈ ధర్మముకొంచెము యనుష్ఠించినను గొప్పదియైన సంసారభయమునుండి తొలగించును.

**వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన।**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోవ్యవసాయినాం. 41.**

పే. కురునందన- ఓయి అర్జునుడా; ఇహ- యీవిధానమంతయు; వ్యవసాయాత్మికా- నిశ్చయాత్మకమయిన; బుద్ధిః-బుద్ధి; ఏకా-ఒకటియును; ముఖ్యమైనదియును; అవ్యవసాయినాం- నిశ్చయ రహితులయొక్క; బుద్ధయః-బుద్ధులు; అనంతాశ్చ-సంఖ్య లేనివియును; బహుశాఖాః- బహు శాఖలుగలదానివలె ఫలాసక్తములయినవియును.

ఓ అర్జునుడా! సాంఖ్యయోగ జ్ఞానముగా నికర్మయోగి జ్ఞానముగాని నిశ్చయ రూపమయిన జ్ఞానము ఒకటియే అగుచున్నది. ఇక నిశ్చయము లేనివారికి కలుగుజ్ఞానములు మాత్రమే నానావిధములయియనంతములుగా నుండును.

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః।**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః.**

కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతింప్రతి. 42. 43.

టీ॥ పార్థ- ఓయి అర్జునుడా; అన్యత్- స్వర్గఫలమున కంటె వేరైనది; నాస్తి- లేదు; ఇతి- ఇట్లని; వేదవాదరతాః, వేద- వేదములయొక్క-; వాద- అర్థవాదముల యందు; రతాః-ఆసక్తులయిన; వాదినః- వాదశీలురయిన; అవిపశ్చితః-అపండితులు; యాం-ఏ; ఇమాం-యీ; పుష్పితాం- పుష్పించిన లతవలె రమ్యమైన; వాచం- స్వర్గఫల ప్రతిపాదకవాక్యమును; వదంతి-చెప్పుచున్నారో; కామాత్మానః-కామ-కోరికల యందు; ఆత్మానః-మనస్సుగలిగినట్టి: స్వర్గపరాః- స్వర్గమే యుత్తమపురుషార్థముగాఁగలిగినవారలు; జన్మకర్మఫలప్రదాం- జన్మ-స్వర్గఫలానంతరమందు జన్మమును; కర్మ- కర్మములనెడి; ఫల-ఫలమును;ప్రదాం-ఇచ్చునట్టి; భోగైశ్వర్యగతింప్రతి- సుఖప్రభుత్వములయొక్క ప్రాప్తిని గూర్చి; క్రియావిశేషబహులాం- క్రియా-కార్యములయొక్క; విశేష-విశేషములు; బహులాం- ప్రచురములుగాఁగలిగిన; వాచం-వాక్యమును చెప్పుచున్నారు.

ఓ అర్జునుడా వేదములయందు జెప్పబడిన అర్థ వాదముల యందాసక్తులయి కామాధీనులయి స్వర్గమే అధికముగా నెంచి

రెవరైతే స్వర్గము మొదలగు ఫలములకు సాధనములైన కర్మములకంటె వేరేలేదనెదు ఈ జన్మకర్మముల నిచ్చునదియు భోగైశ్వర్యములప్రాప్తికి కారణములయిన నానావిధ కర్మములను తెలుపునదియు వినుటకుయింపైనదియునగు మాటను జెప్పుదురో వారు అజ్ఞానులు.

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ నవిధీయతే. 44.

భోగైశ్వర్య ప్రసక్తానాం— సుఖ ప్రభుత్వములయందాసక్తులైన; తయా— క్రియావిశేషబహుళమైన పుష్పితవాక్యముచేత; అపహృతచేతసాం— అపహరింపబడిన చిత్తముగలవారలకు; సమాధౌ— చిత్తైకాగ్ర్యమందు; వ్యవసాయాత్మికా—నిశ్చయాత్మకమైన; బుద్ధిః—బుద్ధి, నవిధీయతే- విధింపబడదు.

ఆ అజ్ఞానుల వాక్యమునకు లోబడిన మనస్సుగలవారలై భోగైశ్వర్యములయందాసక్తులైన వారలకు సాంఖ్యయోగమునందుగాని కర్మయోగమునందు గాని నిశ్చయాత్మకమైన బుద్ధి అంతఃకరణమునందు కలుగదు.

త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45.

హే అర్జున— ఓ అర్జునుడా; వేదాః— వేదములు; త్రైగుణ్య

విషయాః— సత్వరజస్తమోగుణవిశిష్టులైన పురుషులకు తత్తదను రూపఫలములను గలుగఁజేయునట్టివి గావున నీవు; నిర్ద్వంద్వః— శీతోష్ణాదిసుఖదుఃఖరహితుఁడవును; నిత్య సత్వస్థః— శాశ్వతసత్వ గుణవిశిష్టుఁడవును; నిర్యోగక్షేమః— యోగక్షేమరహితుఁడవును; ఆత్మవాన్— ఆత్మజ్ఞానము గలవాఁడవును; నైస్త్రైగుణ్యః— త్రిగుణా తీతుఁడవును; భవ— కమ్మా.

ఓ అర్జునుఁడా! వేదములు ఈ సంసారమే విషయముగా గలవి. నీవు నిష్కాముఁడవును ద్వంద్వములను వదలినవాఁడవును ఎల్లప్పుడును సత్త్వగుణము గలవాఁడవును యోగక్షేమములవిడిచిన వాఁడవును ఆత్మజ్ఞానము కలవాఁడవు నగుము.

యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లు తోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. 46.

ఉదపానే— బావియందు. యావానర్థః— ఎంత ప్రయోజనము; భవతి—అగుచున్నదో; తావానర్థః— అంతప్రయోజనమే; సర్వతః—అంతటను; సంప్లుతోదకే— నిండినయుదకముగలమడుగునందు; భవతి— అగుచున్నది; సర్వేషువేదేషు— సమస్తవేదములయందు; యావానర్థః— ఎంతప్రయోజనము; భవతి—యగుచున్నదో; తావానర్థః—అంతప్రయోజనము; విజానతః-జ్ఞానియైన; బ్రాహ్మణస్య— బ్రాహ్మణునకు; భవతి-అగుచున్నది.

కొద్దినీళ్లుగల బావులు మొదలగువానియందు స్నానపానాదిప్రయోజనము యెంతమాత్రము గలుగునో, అది అంతటను ప్రవహించుచున్న మహాప్రవాహము గల నదులు మొదలగు వానియందుకలుగు ననంత ప్రయోజనములలో నంతర్భావము నొందునట్లు యీసమస్తవేదములయందు చెప్పబడినకర్మలు అనుష్ఠించుటవల్ల కలుగు ఫలము అంతకన్నను మిక్కిలిగొప్పదైన జ్ఞానముగల బ్రాహ్మణునకుఁ గలుగు మోక్షరూపమహాఫలములో నంతర్భావము నొందును.

కర్మణ్యే నాధికారస్తే మాఫలేషు కదాచన।
మాకర్మఫలహేతుర్భూ ర్మాతే సంగోస్త్వకర్మణి. 47.

తే-నీకు; కర్మణ్యేవ-నిత్యనైమిత్తికాదికర్మమునందే; అధికారః-అధికారము; ఫలేషు- కర్మఫలముల యందు, అధికారః-కోరిక; కదాచన-ఒకప్పుడును, మాస్తు- లేకయుండుగాక; త్వం-నీవు; కర్మఫలహేతుః- కర్మఫలమునకు కారణమయిన వాడవు; మాభూః- కాకయుండుము. ఇందుకు శ్రీవిష్ణుపురాణమందు జెప్పియున్న విధంబెట్టిదనిన. శ్లో. తత్కర్మయన్న బంధాయ సావిద్యాయావిముక్తయే। ఆయాసాయాపరంకర్మ విద్యాన్యా శిల్పనైపుణమితి. ఏ కర్మము బంధకరము కాకయున్నదో ఆకర్మము ఏవిద్య ముక్తికారణ మగుచున్నదో ఆ

విద్యయును శ్రేష్ఠములు తక్కిన కర్మములును విద్యలును నా యాసమునకును నేర్పునకును గారణభూతములుగాని వానివల న నితరప్రయోజనము లేదు. తే-నీకు; అకర్మణి- కర్మమును బాలించుటయందు; సంగః-ఆసక్తి; మాస్తు-లేకయుండుగాక.

నీకుఁ గర్మములనుష్ఠించుట యందే యధికారముగాని జ్ఞా ననిష్ఠయందధికారము లేదు. ఆ కర్మానుష్ఠానము నందును నీ కెకప్పుడును దత్ఫలములు గోరుటకారాదు. నీవు కర్మఫలము లకును గారణము గావలదు. కర్మముల ననుష్ఠింపకయుండుట యందును తగిలియుండవలదు.

యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమోభూత్వా సమత్వంయోగఉచ్యతే. 48.

హే ధనంజయ- ఓ అర్జునుడా; సిద్ధ్యసిద్ధ్యోః- ప్రాప్తియం దును అప్రాప్తియందును; సమత్వం- మనస్సు సమముగానుం డుట; యోగ ఇతి- యోగమని; ఉచ్యతే- చెప్పబడుచున్నది. యోగస్థస్సన్- యోగమందున్నవాడవై; సమః-జయాపజయ ములయందు సముడవు; భూత్వా-అయి; సంగం-ఆసక్తిని; త్య క్త్వా-విడిచి; కర్మాణి-యుద్ధాదికర్మములను; కురు-చేయుము.

ఓ అర్జునా! నీవు యోగము నవలంబించిన వాడవై యీ శ్వరారాధనార్థమై సిద్ధికల్గినను సిద్ధిలేకున్నను సముఁడవై కర్మ

ములఁ జేయుము. సిద్ధియందును అసిద్ధియందును సమానుఁడవై యుండుటయే యోగమనఁబడును.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 49.

హే ధనంజయ- ఓయి అర్జునుడా; బుద్ధియోగాత్ - నిష్కామ మనోబుద్ధి యుక్త కర్మమునకంటె; కర్మ- కామ్యకర్మము, దూరేణ-దూరమగుటచేత; అవరం-నికృష్టమయినది; హి- ఏ కారణమువలన; ఫలహేతవః-కామ్యఫలములే కారణములుగ గలవారలు; కృపణాః- నికృష్టులైనసంసారులో, ఇందుకు శ్రుతి "యోవా ఏత దక్షరమ విదిత్వా స్మాల్లోకాత్ ప్రైతిస కృపణః" ఎవడు నాశరహితమైన పరమాత్మను దెలియకయే వాడు పరలోకమునకు బోయినను గృపణుడని చెప్పుచున్నది, కావున, బుద్ధౌ- జ్ఞాన విషయమై; శరణం- కర్మమును; అన్విచ్ఛ- ప్రార్థించుము.

అర్జునా! ఈ సమత్వబుద్ధితోఁ గూడి చేసిన కర్మముకన్నను ఫలాపేక్షలతోఁ జేసిన కర్మము మిక్కిలి నికృష్టము కావున నీవు ఈ సమత్వబుద్ధి నాశ్రయింపుము. ఫలాపేక్షతోఁ గర్మములుచేసి తత్ఫలమునకుఁగారణములై జన్మాదులనొందువారు దీనులై చెడుదురు.

బుద్ధియుక్తో జహాతీహ ఉభేసుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగఃకర్మసు కౌశలం. 50.

బుద్ధియుక్తః-ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వబుద్ధితో గూడినవాడు; ఇహ-ఈలోకమందు; ఉభే-రెండైన;సుకృతదుష్కృతే-పుణ్యాపాపములను; జహాతి- త్యజించుచున్నాడు; తస్మాత్-ఆకారణమువలన; యోగాయ- బుద్ధియోగముకొఱకు; యుజ్యస్వ-యుక్తుడవగుము; తథాహి- అదియుక్తమేకదా; యోగః-ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వబుద్ధియె; కర్మసు- కర్మములయందు; కౌశలం-కుశలత్వము.

సమత్వబుద్ధితో కూడిన వాని కొన్ని పుణ్యా పాపములు రెండును పొందవు కాబట్టి నీవు యోగమునవలంబింపుము కర్మములుచేయుట యందు యోగమునేర్పరితనముగాయున్నది.

కర్మజంబుద్ధియుక్తాహి ఫలంత్యక్త్వా మనీషిణః।
జన్మబంధ వినిర్ముక్తాః పదంగచ్ఛంత్యనామయం. 51.

బుద్ధియుక్తాః- మోక్షవిషయ బుద్ధితో గూడిన; మనీషిణః-ఆత్మానాత్మవివేకజ్ఞులు; కర్మజం-కర్మములవలన బుట్టిన; ఫలం-ఫలమును; త్యక్త్వా-విడిచి; జన్మబంధ వినిర్ముక్తాస్సంతః- జన్మమనెడిబంధమువలన విడువబడినవారై; అనామయం-సర్వోప

ద్రవరహితమయిన; పదం—స్థానమును; గచ్ఛంతిహి—పొందుచు న్నారు గదా.

ఏల యనగా సమత్త్వబుద్ధితో కూడిన పండితుడు కర్మవ లనబుట్టిన ఫలమువిడిచి జన్మబంధముచే లోబడిన వారలై స ర్వోపద్రహితమైన మోక్షమును బొందుదురు.

యదా తె మోహకలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి।
తదాగంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ. 52.

యదా- ఎప్పుడు; తె-నీయొక్క; బుద్ధిః- బుద్ధి; మోహకలి లం- దేహాభిమానరూపకాలుష్యమును; వ్యతితరిష్యతి- దాట గలదో; తదా—అప్పుడు; శ్రోతవ్యస్య-వినదగినయర్థమునకును; శ్రుతస్య-వినినయర్థమునకును; నిర్వేదం-వైరాగ్యమును; గం తాసి- పొందగలవు.

ఎప్పుడైతే ఈబుద్ధి ఈమోహమును విడుచునో అప్పడు నీ వు వినవలసినదానికిని విన్నదానికిని విసుగుపొందుదువు.

శ్రుతివిప్రతి పన్నాతె యదాస్థాస్యతి నిశ్చలా।
సమాధా వచలాబుద్ధి స్తదాయోగ మవాప్స్యసి. 53.

శ్రుతివిప్రతిపన్నా- వేదాంతశ్రవణముచేత ముందు జలింప చేయబడిన; తె-నీయొక్క; బుద్ధిః-బుద్ధి; నిశ్చలాసతీ- చలించని దై; సమాధౌ. " శ్లో. సమాధిస్సమతావస్థా - జీవాత్మ ప

రమాత్మ" యొుక్క; సమాధౌ- సమాధియనంబడును ఆ సమాధియందు; యదా- ఎప్పుడు; అచలా- స్థిరమయినదియై; స్థాస్యతి- ఉండగలదో; తదా; అప్పుడు; యోగం-యోగము; అవాప్స్యసి- పొందగలవు.

వేదాంత శ్రవణముచేత చలనమునొందిన నీబుద్ధి యెప్పుడు సమాధియందు నిశ్చలముగా నిలుచునో అప్పుడు యోగము బొంధగలవు.

అవతారిక. అర్జునుడు చెప్పుచున్నాడు.

అర్జున ఉవాచ.

స్థితప్రజ్ఞస్య కాభాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీఃకిం ప్రభాషేత కిమాసీత వ్రజేతకిమ్. 54.

హే కేశవ- ఓ శ్రీకృష్ణస్వామీ; సమాధిస్థస్య- ఈ చెప్ప బడిన సమాధియందున్న; స్థితప్రజ్ఞస్య- బ్రహ్మైవాహ మస్మి అనెడి నిశ్చలబుద్ధిగలపురుషునికి; భాషా-వాచకలక్షణము; కా యేది; స్థితధీః- బ్రహ్మమునందు నిశ్చలబుద్ధిగల పురుషుడు; కిం ప్రభాషేత-ఏమిపలుకును; కిమాసీత- ఎట్లుకూర్చుండును; కిం వ్రజేత- ఎట్లునడుచును.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు. కృష్ణా! సమాధియందున్న వాఁడై నిశ్చలమైన బుద్ధిగలవానికి ఏమి లక్షణమో అటు నిశ్చ

ల బుద్ధిగల పురుషుడు ఏమి జేయునో ఎట్లుకూర్చుండునో ఏమి పొందునో.

అవతారిక. ఇట్లర్జునుండడుగగా శ్రీ కృష్ణస్వామి యుపదేశించు చున్నాడు.

శ్రీభగవానువాచ.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే. 55.

హేపార్థ- ఓయర్జునుడా; యదా-ఎప్పుడు; ఆత్మన్యేవ-ప్రత్యగాత్మస్వరూపమునందే; ఆత్మనా-తనచేత; సంతుష్టస్సన్-ఆనందించుచున్నవాడై; మనోగతాన్- మనస్సునుబొందిన; సర్వాన్-సమస్తములయిన; కామాన్- ఇచ్ఛామనోరథములను; ప్రజహాతి- విడుచుచున్నాడో; తదా-అప్పుడు; స్థితప్రజ్ఞః-నిశ్చలమయిన ప్రజ్ఞకలవాడని; ఉచ్యతే- చెప్పబడుచున్నాడు.

భగవంతుడు పలికెను, ఓయి అర్జునుడా! ఆత్మస్వరూపానుభవముచే సంతోషించినవాడై మనస్సునందు కలుగునట్టి సమస్త కామములను ఎప్పుడువిడుచునో అప్పుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః।
వీతరాగ భయ క్రోధః స్థితధీర్మునిరుచ్యతే. 56.

దుఃఖేషు - ఆధ్యాత్మికాది దుఃఖములు కలుగుచుండగా; అనుద్విగ్నమనాః - భయపడని మనస్సుగలవాడును; సుఖేషు - సుఖములయందు; విగతస్పృహః - పోయినయాశగలవాడును; వీతరాగభయక్రోధః - వీత - పోగొట్టబడిన; రాగ - ప్రీతియు; భయ - భయమును; క్రోధః - రోషమునుగలిగిన; మునిః - మననశీలుడు; స్థితధీః - నిశ్చలబుద్ధిగలవాడని; ఉచ్యతే - చెప్పబడుచున్నాడు.

దుఃఖములు కలిగినప్పుడు కలతపడని మనస్సుగల వాడును సుఖములయందు ఆశలేనివాడును, రాగము, భయము, క్రోధము లేని వాడు నగు ముని స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు.

యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభం।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57.

యః - ఏపురుషుడు, సర్వత్ర - సకలప్రయోజనములయందును; అనభిస్నేహః - ఉదాసీనునివలె స్నేహము లేనివాడై; తత్తచ్ఛుభాశుభం - ఆయాశుభాశుభములను; ప్రాప్య - పొంది; నాభినందతి - సంతోషించడో; న ద్వేష్టి - ద్వేషించడో; అనగా శుభమును గూర్చి సంతోషమును, అశుభమును గూర్చి దుఃఖమును బొందడో; తస్య - ఆపురుషుని యొక్క; ప్రజ్ఞా - బుద్ధి; ప్రతిష్ఠితా - మిక్కిలి స్థిరమయినది.

ఎవడు సకల ప్రయోజనములందును స్నేహము లేనివాడై ఆయా శుభాశుభములను పొంది శుభముచే సంతోషమును అశుభముచే దుఃఖమును పొందకయుండునో వానిబుద్ధి నిశ్చలము అని చెప్పబడును.

యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58.

యదా- ఎప్పుడు; అయం- ఈయోగి; ఇంద్రియార్థేభ్యః- సర్వవిషయములవలనను; ఇంద్రియాణి- శ్రోత్రాదీంద్రియములను; కూర్మః-తాబేలు; సర్వశః-అంతట; అంగానీవ- కరచరణాద్యవయవములవలెనే; సంహరతే- ఇమిడించుచున్నాడో, తదా-అప్పుడు; తస్య-ఆయోగియొక్క; ప్రజ్ఞా-బుద్ధి; ప్రతిష్ఠితా- మిక్కిలి స్థిరమైనది.

యోగిఎప్పుడైతే తాబేలు తన యవయవములను లోపలికి ముడుచుకొనునట్లు తనయింద్రియముల నన్నిటిని విషయములనుండి వుపసంహరించునో అప్పుడు వానిబుద్ధి నిశ్చలమని చెప్ప బడును.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోప్యస్య పరందృష్ట్వానివర్తతే. 59.

నిరాహారస్య- ఇంద్రియములచేత నింద్రియార్థ గ్రహణము జేయునట్టి దేహాభిమానము గల అజ్ఞానకు; విషయాః-శబ్దాది విషయములు; రసవర్జం- అభిలాషవినాగా; వినివర్తంతే- నివర్తించుచున్నవి; పరం- పరమాత్మను; దృష్ట్వా- చూచి; అస్య ఈ స్థితప్రజ్ఞునికి; రసోపి- అభిలాషయును; నివర్తంతే-నివర్తించుచున్నది.

అట్లుగాక ఆహారము మాత్రము విడిచిన దేహికి విషయములుమాత్రమే నివర్తిల్లును గాని వానియందలి యభిలాష విడువదు. పరమాత్మను తలచిన పిమ్మట ఆయభిలాషయును నశించును.

యతతోహ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభంమనః 60.

హే కౌంతేయ- ఓయర్జునుడా; ప్రమాథీని- బలవంతములయిన; ఇంద్రియాణి-ఇంద్రియములు; యతతః- బ్రహ్మప్రాప్తికొఱకు యత్నముజేయుచున్న; విపశ్చితః-వివేకియైన; పురుషస్య- పురుషుని యొక్క; మనః-మనస్సును; ప్రసభం-బలాత్కారముగా; హరంతిహి-ఆకర్షించుచున్నవిగదా.

ఓ అర్జునుడా! పండితుడైన వాడు యెంతపూనికలో వున్నప్పటికిని బలవంతమైన యింద్రియములు వానిమనస్సును బలా

త్కారముగా ఆకర్షించును.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61.

యుక్తః-యోగి; తానిసర్వాణి- ఆ సకలేంద్రియములను; సంయమ్య-సంగ్రహించి; మత్పరస్సన్- నాయందాసక్తుడైనవాడై; ఆసీత-ఉండును; యస్య-ఎవనికి; ఇంద్రియాణి-ఇంద్రియములు; వశే- అధీనమందువర్తించుచున్నవో; తస్య-ఆపురుషుని యొక్క; ప్రజ్ఞా-బుద్ధి; ప్రతిష్ఠితా-బ్రహ్మమందు స్థిరమైనది.

కాబట్టి ఆయింద్రియములన్నింటిని నిగ్రహించి యోగము పూనినవాడై నాయందే మనస్సును వుంచియుండవలెను. ఏలయనగా ఎవనికి యింద్రియములు స్వాధీనమగునో వానిబుద్ధి నిశ్చలమగును.

ధ్యాయతో విషయాన్ పుంస స్సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.

విషయాన్-విషయములను; ధ్యాయతః- చింతించుచున్న; పుంసః-పురుషునకు; తేషు-ఆవిషయములయందు; సంగః- ఆసక్తి; ఉపజాయతే-పుట్టుచున్నది; సంగాత్- ఆవిషయాసక్తివలన; కామః-కోరిక; సంజాయతే-పుట్టుచున్నది; కామాత్ - కోరికవలన; క్రోధః-క్రోధము; అభిజాయతే-పుట్టుచున్నది.

పురుషునకు విషయములను ధ్యానించుట చేత వానియందు అతనికి ఆసక్తి కలుగును. ఆ ఆసక్తి వలనను కామము కలుగును. కామముచేత క్రోధము కలుగును.

క్రోధాద్భవతి సమ్మోహ స్సంమోహాత్ స్మృతివిభ్రమ ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి. 63.

క్రోధాత్-క్రోధమువలన; సమ్మోహః-వివేకశూన్యము; భవతి- అగుచున్నది; సమ్మోహాత్- ఆ వివేకశూన్యము వలన; స్మృతివిభ్రమః- గురూపదిష్టమార్గభ్రంశము; భవతి-అగుచున్నది; స్మృతిభ్రంశాత్ - ఆవిస్మృతివలన; బుద్ధినాశః- బుద్ధిభ్రంశము; భవతి-అగుచున్నది; బుద్ధినాశాత్ - బుద్ధినాశనమువలన; ప్రణశ్యతి- దిక్కులిచెడిపోవుచున్నాడు.

క్రోధమువలన మోహముగలుగును. మోహమువలన గురూపదిష్టమైన అర్థమునకు విస్మృతియగును. ఆ విస్మృతివలన బుద్ధినశించును. ఆబుద్ధినశించుటవలన అతఁడే నశించును.

రాగ ద్వేష విముక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. 64.

రాగ- అభిలాషము; ద్వేష- అప్రియము, ఈ రెంటిచేతను; విముక్తైః- విడువబడినవిగనుకనే; ఆత్మవశ్యైః-మనస్సాధీనములయిన; ఇంద్రియైః-ఇంద్రియములచేత; విషయాన్- ఇం

ద్రియవిషయములను; చరన్నపి- అనుభవించుచున్న వాడయినను; విధేయాత్మా- స్వాధీనమయిన మనస్సుగల పురుషుడు; ప్రసాదం- నిర్మలత్వమును; అధిగచ్ఛతి- పొందుచున్నాడు.

అందువలన రాగద్వేషములను వదలి స్వాధీనములయిన యింద్రియములచేత విషయముల ననుభవింపుచు స్వాధీనమైన మనస్సుగల యోగి నిర్మలుండగును.

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి. 65.

అస్య- ఈయోగికి; ప్రసాదేసతి- నైర్మల్యముకలుగుచుండగా సర్వదుఃఖానాం- సమస్తదుఃఖములకు; హానిః-నాశనము; ఉపజాయతే-పుట్టుచున్నది; ప్రసన్నచేతసః- స్వచ్ఛమయిన మనస్సుగలపురుషునకు; ఆశు-శీఘ్రముగా; బుద్ధిః- నిశ్చయాత్మకబుద్ధి; పర్యవతిష్ఠతి- స్థిరముగానిలుచుచున్నది.

నిర్మలత్వము కలుగుటవలన వీనికి సమస్తదుఃఖములును నశించును. ఎందువల్లననగా ప్రసన్నమయిన నిర్మలమయిన మనస్సుగలవానికి శీఘ్రముగా బుద్ధి స్థిరపడును.

నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్తస్యభావనా।
నచాభావయతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖం. 66.

అయుక్తస్య- ఇంద్రియనిగ్రహము లేని వానికి; బుద్ధిః- అ

త్మవిషయబుద్ధి; నా_స్తి-లేదు; అయు_క్తస్య-వానికి; భావనాచ-ఆత్మస్వరూపాభినివేశమును; నా_స్తి-లేదు; అభావయతః-బ్రహ్మభావనచేయనివానికి; శాంతిః- చిత్తోపరతి; నా_స్తి- లేదు; అశాంతస్య- చిత్తోపరతిలేనివానికి; సుఖం- బ్రహ్మానంద సుఖము; కుతః- ఎక్కడిది.

ఇంద్రియ నిగ్రహము లేనివానికి ఆత్మవిషయబుద్ధి కలుగదు. మరియును ఆత్మస్వరూప భావనయునశింపదు. ఆత్మభావనలేని వానికిచిత్తోపరతికలుగదు. చిత్తోపరతిలేనివానికిసుఖము లేదు.

ఇంద్రియాణాం హిచరతాం యన్మనో౽ను విధీయతే।
తదస్య హరతిప్రజ్ఞాం వాయుర్నావమి వాంభసి. 67.

ఇంద్రియాణాం- ఇంద్రియములు; చరతాం- విషయముల యందు సంచరించుచుండగా; యన్మనః- ఏమనస్సు; అనువిధీయ్యతే- పురుషునిచేత నియమింపబడక అనుసరించివర్తింపబడుచున్నదో; తత్-ఆమనస్సు; అస్య-ఈపురుషునియొక్క; ప్రజ్ఞాం-ఆత్మానాత్మవివేకమును; అంభసి-ఉదకమందు; నావం- ఓడను; వాయురివ- ప్రతికూలవాయువు వలెనే; హరతిహి- అకర్షించుచున్నది గదా.

యథేచ్ఛగా విషయములయందు తిరుగుచున్న యింద్రియములకు మనస్సులోబడునేని ఆమనస్సు సముద్రమునందు పెను

గాలి ఓడనువలె పురుషుని ఆత్మబుద్ధిని హరించును.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68.

హే మహాబాహో- ఓయి అర్జునుడా; తస్మాత్ - ఆకారణమువలన; యస్య-ఎవనియొక్క; ఇంద్రియాణి-ఇంద్రియములు; సర్వశః-అంతటను; ఇంద్రియార్థేభ్యః- విషయములవలనను; గృహీతాని- నియమింపబడుచున్నవో; తస్య-ఆపురుషుని యొక్క; ప్రజ్ఞా-బుద్ధి; ప్రతిష్ఠితా- మిక్కిలిస్థిరమయినది.

ఓ అర్జునుడా అందువలన యెవడు తన యింద్రియముల నన్నిటిని తద్విషయములనుండి నిగ్రహించునో వానిబుద్ధి నిశ్చలమగును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69.

యా- ఏయాత్మవిషయమయినబుద్ధి, సర్వభూతానాం-బుద్ధిరహితులయిన సర్వప్రాణులకు; నిశా- గోచరము కాకపోవుటవలన రాత్రివలెనప్రకాశమగుచున్నదో; తస్యాం- ఆయాత్మవిషయమయిన బుద్ధియందు; సంయమీ- ఇంద్రియనిగ్రహము గల పురుషుడు; జాగర్తి-మేలుకొనియుండును, అనగా సాక్షాత్కారము చేయుచుండుననుట; యస్యాం- ఏశబ్దాదివిషయమయిన

బుద్ధియుండును; భూతాని- సమస్తప్రాణులు; జాగ్రతి-మేలుకొన్నచున్నారో; సా-ఆశబ్దాదివిషయబుద్ధి; పశ్యతః- ఆత్మావలోకనపరుడయిన; మునేః-మననశీలునకు; నిశా-అవిద్యావ్యవహారాభావమౌటవలన రాత్రివలెనే యప్రకాశమగుచున్నది.

ఏది సర్వప్రాణులకు తెలియక పోవుటవలన రాత్రివలె దోచునో ఆ ఆత్మను యోగియైనవాడు తెలిసినవాడై చూచుచుండును. దేనిని సమస్తప్రాణులు జాగరూకులయి చూచుచుందురో ఆశబ్దాది విషయములును జ్ఞానియగు వానికి రాత్రివలె ప్రకాశింపకుండును.

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్రమాపః ప్రవి
శంతియద్వత్ । తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
సశాంతిమాప్నోతి నకామకామీ. 70.

ఆపః-అన్యప్రవాహజలములు; ఆపూర్యమాణం- నానానదీజలములచేత నిండింపబడినదైనను; అచలప్రతిష్ఠం - మర్యాద నతిక్రమించకయున్న; సముద్రం-సముద్రుని; యద్వత్ - ఏప్రకారముగా; ప్రవిశంతి-ప్రవేశించుచున్నవో; తద్వత్ -ఆప్రకారముగా; సర్వే-సమస్తములయిన; కామాః- శబ్దాదివిషయములు; యం- ఏఇంద్రియనిగ్రహముగల పురుషుని; ప్రవిశంతి- ప్రవేశించుచున్నవో; సః-ఆపురుషుడు; శాంతిం-కేవలబ్రహ్మైక్య

మును; ఆప్నోతి-పొందుచున్నాడు; కామకామీ- కామగ్రస్తుడయినవాడు; న-కాడు.

నదీనదాది ప్రవాహములచే నిండింపబడుచున్నను తన హద్దుమీరనిదియై సముద్రము ఎట్లు తననోటికివచ్చు జలములన్నిటిని గ్రహించుచు కొంచమయినను వికారము పొందకయుండునో అట్లు ఏ యోగిశబ్దాది సమస్త విషయములను గ్రహించుచున్నను కొంచమయినను వికారము పొందకయుండునో అతనుశాంతిని బొందునుగాని విషయములను కోరువాడు ఎన్నటికిని శాంతిబొందడు.

విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతినిస్పృహః।
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి. 71.

యఃపుమాన్ - ఏపురుషుఁడు; సర్వాన్- సమస్తములయిన; కామాన్-కామములను;విహాయ-విడిచి; నిస్పృహస్సన్-కాంక్షావిరహితుడై; చరతి- జీవనమాత్రచేష్టాశ్రేష్టుడయి సంచరించుచున్నాడో; సః-ఆపురుషుడు; శాంతిం-మోక్షమును; అధిగచ్ఛతి- పొందుచున్నాడు.

ఏ పురుషుడు సమస్త కామములను విడిచి దేనియందును ఆశలేనివాడై మమకారమును అహంకారమును లేనివాడై యుండునో అతనుశాంతిబొందును.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాంప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72.

హేపార్థ- ఓఅర్జునుడా; ఏషా-ఇది; బ్రాహ్మీ- బ్రహ్మమందు బుట్టిన; స్థితిః- నిష్ఠ; ఏనం- ఈ బ్రహ్మనిష్ఠను; ప్రాప్య- పొంది; నవిముహ్యతి- మోహమునుబొందడు; అస్యాం- ఈబ్రహ్మనిష్ఠయందు; అంతకాలేఽపి- దేహావసాన సమయమందైనను; స్థిత్వా- నిలచి; బ్రహ్మనిర్వాణం- మోక్షమును; ఋచ్ఛతి- పొందుచున్నాడు.

ఓ అర్జునుడా! ఇది బ్రహ్మనిష్ఠయనబడును. దీనిని బొందినవాడు మోహమునొందడు. మరణ కాలమునందైనను ఈ బ్రహ్మనిష్ఠబొందినవాడు మోక్షమునొందును.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే,
సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః.

ఓం తత్సదితి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య బ్రహ్మానంద
సరస్వతీశిష్య రామచంద్రానంద సరస్వతీవిరచితాయాం,
భగవద్గీతావ్యాఖ్యాయాం పదయోజనీ సమాఖ్యాయాం
సాంఖ్య యోగో నామ ద్వితీయో ధ్యాయః.

---

ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీ కృష్ణార్జునులసంవాదరూపంబయిన
శ్రీ భగవద్గీతలయందు సాంఖ్యయోగ మనెడి
ద్వితీయా ధ్యాయము ముగిసినది.

శ్రీ ర స్తు.

శ్రీకృష్ణాయ నమః.

శ్రీ భగవద్గీతా ప్రారంభః.

కర్మయోగో నామ తృతీయోధ్యాయః.

అర్జున ఉవాచ.

జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ 1.

హే జనార్దన- హే కేశవ. ఓ శ్రీకృష్ణస్వామీ; బుద్ధిః-కర్మమూలమైన జ్ఞానము; కర్మణః-కర్మమునకంటె; జ్యాయసీ-శ్రేష్ఠమయినదని; తే-నీకు; మతా చేత్ - ఇష్టమైనదాయెనేని; తత్కిం-అదియేమువలన; ఘోరే- భయంకరమైన; కర్మణి-కర్మమందు; మాం- నన్ను; నియోజయసి- ప్రవర్తింప జేయుచున్నావు.

అర్జునుడు అడుగుచున్నాడు.—ఓకృష్ణా! నీకు కర్మముకంటె జ్ఞానమే శ్రేష్ఠమని అభిప్రాయమైన యెడల నన్ను భయంకరమైన ఈ కర్మముచేయుమని యేల ప్రేరేపించుచున్నావు.

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్. 2.

వ్యామిశ్రేణేవ- మిశ్రితమయినదానివలెనున్న; వాక్యేన- సంశయప్రద వాక్యముచేత; మే- నాయొక్క; బుద్ధిం- బుద్ధిని; మోహయసీవ- మోహింపజేసెడివానివలెనున్నావు; అహం- నేను; యేన- దేనిచేత; శ్రేయః- మోక్షమును; ఆప్నుయాం- పొందుదునో; ఏకం- ఈ జ్ఞానకర్మములలో నొకటైన; తత్- దానిని; నిశ్చిత్య- నిర్ణయించి; వద- చెప్పుము.

నీమాట స్పష్టార్థము కాక యుండుటవల్ల నాబుద్ధికి భ్రమకలుగునట్లున్నది. కాబట్టి నాకు దేనిచేత శ్రేయస్సు కలుగునో అట్టిది ఒకటిగా నిశ్చయించి చెప్పుము.

అవతారిక. ఇట్లర్జునునిచేత పృచ్ఛచేయబడిన భగవంతుడానతిచ్చుచున్నాడు.

శ్రీ భగవాన్ ఉవాచ.

లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం. 3.

హే అనఘ— పాపరహితుడైన అర్జునుడా; పురా—ముందు; అస్మిన్‌లోకే— ఈలోకమందు; మయా—నాచేత; సాంఖ్యానాం— ఆత్మానాత్మవస్తు వివేకముగల వారలకు; జ్ఞానయోగేన— జ్ఞాన యోగముచేతను; యోగినాం—చిత్తశుద్ధిగలయోగులకు; కర్మ యోగేన—కర్మ యోగముచేతను; ద్వివిధా— రెండుప్రకారము లుగల; నిష్ఠా—స్థితి; ప్రోక్తా—చెప్పబడెను.

భగవంతుడు చెప్పుచున్నాడు.—అర్జునా! మున్ను ఈ లోక మునందు నేను జ్ఞానయోగము చేత సన్యాసులకును కర్మయో గము చేత కర్మనిష్ఠులకును రెండు విధములయిన నిష్ఠలను చెప్పితిని,

నకర్మణామ నారంభా న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే
నచసన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4.

పురుషః—పురుషుడు; కర్మణాం-యజ్ఞాదికర్మముల యొక్క; అనారంభాత్ – చేయకపోవుటవలన; నైష్కర్మ్యం-క్రియారహి తమయిన నిశ్చయమును నాశ్నుతే— పొందడు; ఇందుకుస్మృతి "శ్లో. జ్ఞాన ముత్పద్యతె పుంసాం క్షయాత్పాపస్య కర్మణః। యథా దర్శ తల ప్రఖ్యే పశ్యత్యా త్మాన మాత్మని." పాప కర్మములు నశించుట వలన బురుషులకద్దముతో సమానమై నట్టియందు బరమాత్మను జూచునట్లు జ్ఞానముగలుచున్నదని

తాత్పర్యము. సన్న్యసనాదేవ- జ్ఞానరహితకర్మసన్న్యాసమాత్రము వలనే; సిద్ధిం- నైష్కర్మ్య లక్షణ సిద్ధిని; సమధిగచ్ఛతి- పొందఁడు గదా.

కర్మములను అనుష్ఠింపక పోవుట వలననే పురుషునకు కర్మశూన్యత కలుగదు. కర్మములను విడుచుట మాత్రము వలననే జ్ఞానయోగ నిష్ఠ సిద్ధింపదు.

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. 5.

హి-ఏ కారణమువలన; కశ్చిత్-ఒకానొకపురుషుఁడు; అకర్మకృత్సన్- కర్మము జేయనివాఁడై; జాతు- ఒకానొక యవస్థయందును; క్షణమపి-క్షణమాత్రమైనను; నతిష్ఠతి-ఉండఁడో; తథాహి- అదియుక్తమే గదా; ప్రకృతిజైః- ప్రకృతివలన బుట్టిన; గుణైః-రాగద్వేషాదిగుణములచేత; అవశస్సన్- అస్వతంత్రుఁడనదగు; సర్వః-సమస్తజనమును; కర్మ-కర్మము; కార్యంతే- చేయఁబడుచున్నది.

ఏలయనగా ఎవ్వఁడును క్షణకాలమైనను ఎప్పుడును కర్మము చేయక వుండఁజాలఁడు. ఎందువల్లయనగా దాని ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమోగుణములు అతనిచేత కర్మములనుచేయింపక విడువవు.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే.

యః-ఎవ్వడు; కర్మేంద్రియాణి-వాగాదికర్మేంద్రియములను; సంయమ్య-నిగ్రహించి; మనసా-మనస్సుచేత; ఇంద్రియార్థాన్-శబ్దాదివిషయములను; స్మరన్- చింతించుచున్నవాడై; ఆస్తే-ఉన్నాడో; సః-వాడు; విమూఢాత్మా-వివేకశూన్యమయినమనస్సుగల; మిథ్యాచారః-దబ్బరియాచారముకలవాడని; ఉచ్యతే- పలుకబడుచున్నాడు.

ఎవ్వడు కర్మేంద్రియములను నిగ్రహించి విషయములను మనస్సుచేత స్మరించుచుండునో అట్టి వివేకము శూన్యుడు మిథ్యాచారుడని చెప్పబడుచున్నాడు.

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. 7.

హే అర్జున-ఓ అర్జునుడా; యస్తు- ఎవ్వడైతే; ఇంద్రియాణి-జ్ఞానేంద్రియములను; మనసా-మనస్సుచేత; నియమ్య-నిగ్రహించి; కర్మేంద్రియైః-వాగాదికర్మేంద్రియములచేత; కర్మయోగం-కర్మయోగమును; అసక్తస్సన్-ఫలకాంక్షారహితుడై; ఆరభతే-చేయుచున్నాడో; సః-వాడు; విశిష్యతే- ఉత్తముడగుచున్నాడు.

అర్జునా! ఎవఁడైతే మనస్సుచేత ఇంద్రియముల నిగ్రహించి ఫలాపేక్షలేనివాఁడై కర్మేంద్రియములచేత కర్మయోగమును అనుష్ఠించునో అతడు అధికుఁడుగా చెప్పబడు చున్నాఁడు.

నియతంకురుకర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః।
శరీరయాత్రాపిచతేన ప్రసిద్ధ్యేదకర్మణః.　　　8.

హేఅర్జున–ఓఅర్జునుఁడా; త్వం–నీవు; నియతం–నిత్యమైన; కర్మ–సంధ్యావందనాదికర్మమును; కురు–చేయుము; హి–ఏకారణమువలన; అకర్మణః– కర్మముచేయకపోవుటకంటె; కర్మ– కర్మము; జ్యాయః– యోగ్యమయినదో; అకర్మణః– స్వకర్మరహితుఁడవయిన; తే–నీకు; శరీరయాత్రాఅపి– శరీరస్థితియును; నప్రసిద్ధ్యేత్– ప్రసిద్ధిబొందదు.

అందువలన నీవు నిత్యమైన కర్మమును చేయవలెను. ఏలయనగా కర్మము చేయకుండుటకన్నను కర్మముచేయుట మేలు. నీవుకర్మముచేయవేని నీకు శరీరస్థితికూడా సిద్ధింపదు.

యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర.　　　9.

హేకౌంతేయ–ఓఅర్జునుఁడా; యజ్ఞార్థాత్, "యజ్ఞోవైవిష్ణుః" అనెడి శ్రుతివలన, భగవద్విషయమయిన; కర్మణః– కర్మమునకంటె; అన్యత్ర– మరియొకకర్మమునందు; అయంలోకః– ఈజ

నుడు; కర్మబంధః- కర్మబంధముగలవాడు; భవతి- అ గుచున్నాడు; తదర్థం- ఆయజ్ఞార్థమయిన; కర్మ-కర్మమునే; ము క్తసంగస్సన్- విడువబడిన కర్మఫలాసక్తి గలవాడవై; సమా చర- లెస్సగా చేయుము.

ఈశ్వరారాధనముగా చేయబడుకర్మముకంటె భిన్నమైనకర్మ ము లోకమునకు బంధమునుకలిగించును. అందువల్లఅర్జునా నీ వు ఈశ్వరారాధనమైనకర్మమును ఫలాపేక్ష లేనివాడవై చేయుము.

సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేషవో స్త్విష్ట కామధుక్. 10.

ప్రజాపతిః-బ్రహ్మదేవుడు; పురా- పూర్వసృష్టికాలమందు;స హయజ్ఞాః-యజ్ఞములతోకూడిన; ప్రజాః-ప్రజలను; సృష్ట్వా-సృ జించి; ఉవాచ- చెప్పబోయెడి ప్రకారముగా బలికెను; అనే న- ఈయజ్ఞముచేత; ప్రసవిష్యధ్వం- ప్రజలను బుట్టింపుడు; ఏ షః-ఈయజ్ఞము; వః-మీకు, యిష్టకామధుక్- అభీష్టకామము ల బితుకునట్టిది; అస్తు-అగుగాక.

మున్ను ప్రజాపతి యజ్ఞములతోకూడా ప్రజలను సృజించి ఇట్లు బలికెను. మీరు ఈయజ్ఞముచేత వృద్ధిచేసికొనుడు ఇది మీకు కోరిన కోర్కులను యిచ్చునది యగు గాక.

దేవాన్ భావ యతానేన తే దేవా భావ యంతువః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమ వాప్స్య థ. 11.

హేజనాః-ఓజనులారా; అనేన-ఈయాగముచేత; దేవాన్-ఇంద్రాదిదేవతులను; భావయత-వృద్ధిపొందింపుడు; తే దేవాః-ఆదేవతలు; వః-మిమ్ము; భావయంతు-వృష్ట్యాదులచేత వృద్ధిబొందింతురు గాక; పరస్పరం-అన్యోన్యమును; భావయంతః-వృద్ధిబొందించుచున్నవారలయి; పరం-ఉత్కృష్టమయిన; శ్రేయః-ముక్తిని; అవాప్స్యథ-పొందగలరు.

మీరు ఈయజ్ఞముచేత దేవతలను ఆరాధింపుడు, ఆ దేవతలు మిమ్ము వర్షాదులచేత ఆదరింతురు గాక ఇట్లు మీరు ఒండరులను సంభావించుకొనుచూ ఉత్తమమయిన శ్రేయస్సును పొందుడు.

ఇష్టాన్ భోగాన్ హివో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవసః.

యజ్ఞభావితాః-యాగముచేత సంతోషింపబడిన; దేవాః-దేవతలు; వః-మీకొఱకు; యిష్టాన్-అభీష్టములయిన, భోగాన్-స్త్రీపశుపుత్రాదిభోగములను; దాస్యంతే హి-యిచ్చుచున్నారుగదా; తైః-ఆదేవతలచేత; దత్తాన్-ఇవ్వబడిన వృష్ట్యన్నాది భోగములను; ఏభ్యః-ఆ దేవతలకొఱకు; అప్రదా

య-ఇవ్వక నే; యః-ఎవ్వడు; భు_క్తే-భుజించుచున్నాడో; సః-వాడు; స్తేనఏవ- చోరుడే.

ఏలయనగా. దేవతలు మీచే యజ్ఞముల నారాధింపబడ్డవారై మీకు కోరినభోగములను ఇత్తురు. దేవతలచేత ఇయ్యబడిన వానిని ఆదేవతలకు ఇయ్యక ఎవడుతినుచున్నాడో వాడు దొంగయేగాని వేఱుగాడు.

యజ్ఞశిష్టా శివస్సంతో ముచ్యంతే సర్వ కిల్బిషైః।
భుంజతే తేత్వఘం పాపా యేపచంత్యాత్మ కారణాత్.13.

యజ్ఞశిష్టాశివ - యజ్ఞమువలన మిగిలిన అమృతమనెడి అన్నమును భుజించెడి స్వభావముగలిగిన; పంతః-సత్పురుషులు; సర్వకిల్బిషైః-సమ_స్తములైన పంచసూనాది పాపములచేతను ముచ్యంతే- విడువబడుచున్నారు, ఆపంచ సూనములు స్మృతియందు చెప్పబడియున్నవి. "శ్లో. ఖండినీ పేషణీ చుల్లీ ఉదకుంభీచ మార్జనీ। పంచసూనా గృహస్థస్య తాభిస్స్వర్గం నగచ్ఛతి." తరుగునదియు, నూరునదియు, విసుచు నదియు, కాల్చునదియు. ఊడ్చునదియు ఈ యైదును బంచసూనములు. ఏతు-ఎవ్వరైతే; ఆత్మకారణాత్ - తన యుదరపూరణ నిమి_త్తమువలన; పచంతి- పాకముచేయుచున్నారో; పాపాః- పాపాత్ము

లయిన; తే-వారలు; అఘం-పాపమును; భుంజతే-అనుభవిం
చుచున్నారు.

యజ్ఞము చేయగా మిగిలిన అన్నమును భుజించునట్టి సత్పు
రుషులు సర్వపాపములచేతను విడువబడుదురు. ఎవరయితే త
మకొఱకే వండుకొందురో ఆ పాపులు పాపమునే భుజింతురు.

అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః. 14.

అన్నాత్-అన్నమువలన; భూతాని-ప్రాణులు; భవంతి-పు
ట్టుచున్నారు; పర్జన్యాత్ - వర్షాధిదేవతయైన పర్జన్యునివల
న; అన్నసంభవః- అన్నము యొక్క పుట్టువు కలుగుచున్నది,
అది యెట్లనిన. "శ్లో. అగ్నౌ ప్రాస్తా హుతిస్సమ్య గాదిత్య
ముపతిష్ఠతే। ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టేరన్నం తతః ప్ర
జాః." అను స్మృతివలన యజ్ఞాదుల వలన వృష్ట్యాదులు గ
లుగుచున్నవి; యజ్ఞః- యాగము; కర్మ సముద్భవః-కర్మ
మువలన గలుగుచున్నది.

అన్నమువలన భూతములు పుట్టును, భూతములవలన అ
న్నము కలుగును, యజ్ఞమువలన వర్షముకలుగును, ఆయజ్ఞము
కర్మమువలన కలుగును.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం. 15.

కర్మ-కర్మమును; బ్రహ్మోద్భవం, బ్రహ్మ-వేదమే; ఉద్భవం-పుట్టువుగాగలిగిన దానినిగా; విద్ధి-తెలియుము; బ్రహ్మ-ఆవేదమును; అక్షరసముద్భవం-పరమాత్మ పుట్టువుగా గలిగిన దానినిగా; విద్ధి-తెలియుము; తస్మాత్-ఆకారణమువలన; బ్రహ్మ-వేదము; సర్వగతం-అంతట వ్యాపించినదై; యజ్ఞే-యజ్ఞమందు; నిత్యం-ఎల్లప్పుడును; ప్రతిష్ఠితం-ఉంచబడినది.

కర్మ వేదమువలనకలుగును, ఆవేదముపరమాత్మవలన వెడలును, అందువలన నిత్యమయిన వేదము యజ్ఞమునందు ప్రతిష్ఠితముగా నున్నది.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ సజీవతి.

హేపార్థ-ఓయిఅర్జునుడా; యః-ఎవ్వడు; ఏవం-ఈపూర్వోక్త ప్రకారముగా; ప్రవర్తితం-ప్రవర్తింపజేయబడిన; చక్రం-జగచ్చక్రమును; ఇహ-ఈలోకమందు; నానువర్తయతి-అనువర్తించడో; సః-వాడు; అఘాయుః-పాపమే యాయువుగాగలవాడును; ఇంద్రియారామః-యింద్రియములచేత విష

యూనసక్తుడయినవాఁడును కావున; మోఘం-వ్యర్థముగానట్లు; జీ
వతి- బ్రతుకుచున్నాఁడు.

అర్జునా! ఇట్లు నడుపబడుచున్న చక్రమును ఎవఁడైతే అను
వర్తింపఁడో అతడు ఇంద్రియలోలుఁడై పాపజీవనుఁడగును కా
బట్టి వానిబ్రతుకు వ్యర్థము.

యస్త్వాత్మ రతి రేవస్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్యకార్యం నవిద్యతే. 17.

యః-ఏ; మానవస్తు-నరుఁడైతే; ఆత్మరతిరేవా- తనయం
దనీతిగలవాడును; ఆత్మతృప్తశ్చ- తనచేతనె తృప్తిబొందుచు
న్నవాడును; ఆత్మనేవ-తనయందె; సంతుష్టశ్చ- సంతోషపడు
చున్నవాడును; స్యాత్-అవునో; తస్య- ఆ యాత్మవిదునికి; కా
ర్యం- చేయదగిన; నవిద్యతే-లేదు.

ఇక యెవఁడైతే ఆత్మచేతనే సంతోషించువాడును, ఆత్మ
చేతనే తృప్తుడయి వుండువాడును, ఆత్మచేతనే రమించువాడు
ను అగునో అట్టి జ్ఞానికి చేయదగినకర్మ ఏదియు లేదు.

నైవతస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన।
నచాస్య సర్వ భూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః. 18.

తస్య- ఆ బ్రహ్మనిష్ఠునకు; ఇహ-ఈలోకమందు; కృతేన-క
ర్మముచేసినందుచేత; అర్థం-పుణ్యము; నైవ- లేదు; అకృతే

న-కృతః ణాముచేయుటందుచేత; కశ్చన-బకానొక ప్రత్యవాయము మును; న-లేదు; అస్య- ఈ బ్రహ్మవేత్తకు; సర్వభూతేషు- స మస్తభూతములయందు; అర్థవ్యపాశ్రయః- ప్రయోజన నిమిత్త మైనయాశ్రయము- కశ్చిత్ - ఒకటియును; న-లేదు.

ఆ జ్ఞానికి ఏకర్మము చేసినను ప్రయోజన మేదియు లేదు, చేయకున్నను హానిఏమియు లేదు. మరియువానికి సమస్తభూత ములందును ఏ ప్రయోజనమును కానరాదు.

తస్మాద సక్తస్సతతం కార్యం కర్మ స్సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. 19.

తస్మాత్ - ఆకారణమువలన; త్వం-నీవు; అసక్తస్సన్- ఫల ఆంగవర్జితుడవై; సతతం-నిత్యమును; కార్యం-చేయదగిన; క ర్మ-కర్మమును;సమాచర-ఆచరింపుము; హి-ఏకారణమువల న; అసక్తః-ఫలాసక్తిలేనివాడై; కర్మ-కర్మమును;ఆచరన్- నచరించుచున్న; పూరుషః- పురుషుడు; పరం- మోక్షమును; ఆప్నోతి- బొందుచున్నాడో.

అట్లు అజ్ఞానియగువాడు కర్మముచేయవలసినదేగావున నీ వు ఫలాపేక్ష లేనివాడవై విహితమైనకర్మమును ఎల్లప్పుడును చేయుచుండుము. ఫలాపేక్ష లేక కర్మముచేయునట్టిపురుషుడు సత్త్వశుద్ధినొంది క్రమముగా మోక్షముపొందును.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః।
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. 20.

జనకాదయః – జనకులు మొదలుగాగల రాజర్షులు; కర్మణైవ – నిష్కామకర్మముచేతనే; సిద్ధిం – చిత్తశుద్ధిని; ఆస్థితాహి – పొందిరిగదా; త్వం – నీవు; లోకసంగ్రహమేవ, లోక – జనముల యొక్క; సంగ్రహమేవ – ప్రయోజనమునే; సంపశ్యన్ – చూచుచున్నవాడవై; కర్మ – కర్మమును; కర్తుం – చేసెడికొఱకు; అర్హసి – తగవు.

ఎట్లనగా జనకమహారాజు మొదలగువారు కర్మముచేతనే చిత్తశుద్ధిద్వారమున మోక్షముబొందిరి. మఱియు నీవు లోకులను సన్మార్గమునందు ప్రవర్తించునట్లు చేయవలసిన వాడవగుటవలన నీవును కర్మము చేయవలసినదే.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః।
సయత్ప్రమాణం కురుతే లోకస్త దనువర్తతే. 21.

శ్రేష్ఠ – బ్రహ్మవిదుడు; యద్యత్ – ఏయే కర్మమును; ఆచరతి – ఆచరించుచున్నాడో; ఇతరోజనః – పామరుడయినజనుడు; తత్తదేవ – ఆయా కర్మమునే; ఆచరతి – ఆచరించుచున్నాడు; సః – ఆబ్రహ్మనిష్ఠుడు; యత్ప్రమాణం – ఏప్రమాణమును; కు

తే-చేయుచున్నాడో; లోకా-ప్రామరజనులు; తత్-ఆయర్థాన్ని; అనువర్తతే- అనుసరించుచున్నాడు.

ఎందువల్లననగా ఉత్తముడయినవాడు దేనిని ఆచరించునో దానినే ఇతర జనులును ఆచరింతురు. అతడు దేనిని ప్రమాణముగా అంగీకరించునో లోకమంతయు దానినే అనువర్తించును.

నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి. 22.

హే పార్థ- ఓయిఅర్జునుడా; కర్తవ్యం-చేయుదగిన కర్మము; కించన-ఏమియును; నాస్తి-లేదు; త్రిషులోకేషు- మూడులోకములయందు; అనవాప్తం-పొందబడనిదియును; అవాప్తవ్యం- పొందదగినదియును; నాస్తి-లేదు; ఐనను, కర్మణ్యేవ-కర్మమందు; వర్తే- ఉంటున్నాను గదా.

అర్జునా! నాకు మూడు లోకముల యందును జేయవలసిన దేదియు లేదు. ఇదివరకు పొందబడని దేదియు పొందవలసినది లేదు. అయినను కర్మము చేయుచునేవున్నాను.

యదిహ్యహం నవర్తేయం జాతుకర్మణ్యతంద్రితః।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః. 23.

హే పార్థ– ఓ అర్జునుడా; అహం–నేను; జాతు– ఒకప్పుడు ను; అతంద్రితస్సన్– అప్రమత్తుడనై; కర్మణి–కర్మమునందు; నవర్తేయం యది– ఉండకపోతినేని; మనుష్యాః– మనుష్యులు; సర్వశః–సర్వప్రకారములుగా; మమ–నాయొక్క; వర్త్మ–మార్గమును; అనువర్తంతే– అనుసరించుచున్నారు.

ఏలయనగా అర్జునా! నేను జాగ్రత్తతో కర్మము చేయక యుందునేని మనుష్యులంతయు నా మార్గమునే అనుసరింతురు.

ఉత్సీదేయురిమే లోకా నకుర్యాం కర్మ చేదహమ్।
సంకరస్యచ కర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః. 24.

అహం–నేను; కర్మ–కర్మమును; నకుర్యాంచేత్–చేయనైతి నేని; ఇమేలోకాః– ఈజనులు; ఉత్సీదేయుః–చెడిపోదురు; సంకరస్యచ–వర్ణసంకరమునకును; కర్తా–కర్తను; స్యాం– అగుదును; అందువలన; ఇమాః ప్రజాః–ఈప్రజలను; ఉపహన్యాం–చెరిచినవాడనౌదును.

నేను కర్మముచేయని యెడ ఈలోకములన్నియు నాశము నొందును. సంకరముకూడా చేసిన వాడనగుదును. ఈ ప్రజలను హతముచేసిన వాడగుదును.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత।
కుర్యాద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షుర్లోక సంగ్రహమ్. 25.

హే భారత-ఓయి అర్జునుడా; అవిద్వాంసః-అనాత్మజ్ఞులు; కర్మణి-కర్మమునందు; సక్తాః-ఆసక్తిగలవారలై; యథా-ఏప్రకారముగా; కుర్వంతి- చేయుచున్నారో; తథా- ఆప్రకారముగా; లోకసంగ్రహం- జనుల దుర్మార్గప్రవర్తనమును నివారించుటను; చికీర్షుః-చేయ నిశ్చయించిన; విద్వాన్-ఆత్మజ్ఞుడు; అసక్తస్సన్-సంగవర్జితుడై; కుర్యాత్- చేయవలెను.

అర్జునా! అజ్ఞానులు ఫలాపేక్షకలవారలై ఎట్లు కర్మముచేయుదురో అట్లు జ్ఞాని ఫలాపేక్షలేనివాడై లోకులకు సన్మార్గము చూపుటకొఱకు కర్మము చేయవలెను.

నబుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్।
జోషయే త్సర్వ కర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్.

విద్వాన్-పండితుడు; కర్మసంగినాం- కర్మమందాసక్తిగలిగిన; అజ్ఞానాం-అవివేకుల యొక్క; బుద్ధిభేదం- కర్మమందాసక్తిగలబుద్ధికి చలనమును; నజనయేత్ - పుట్టించగూడదు. మరియేమనిన; యుక్తః- సావధానుడై; సమాచరన్- ఆచరించుచున్నవాడై; సర్వకర్మాణి- సమస్తకర్మములను;జోషయేత్ -ఆచరింపజేయవలయును.

కర్మమునందాసక్తులైన అజ్ఞానులకు జ్ఞాని బుద్ధిభేదము కలిగించరాదు. మరి యేమియనగా తాను పూనికతో కర్మముల

ను చేయుచుండి వారివలనకూడాకర్మములను చేయించవలెను.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితిమన్యతే. 27.

అహంకార విమూఢాత్మా- అహంకార భావముచేత దెలియని మనస్సుగల పురుషుడు; ప్రకృతేః- మాయవలన బుట్టిన; గుణైః- కార్యకారణరూపములయిన యింద్రియముల చేతను, తత్తద్వికారములచేతను; సర్వశః- బహుప్రకారములుగా; క్రియమాణాని-చేయబడుచున్న; కర్మాణి-కర్మములను; కర్తా-చేసినవాడను; అహమితి-నేనని; మన్యతే- తలంచుచున్నాడు.

ప్రకృతి వికారములయిన సత్త్వ రజస్తమోగుణముల చేత చేయబడునట్టికర్మములన్నిటిని అహంకారముచే మోహమునొందిన మనస్సుగలవాడు తానుజేయునాడని అభిమానించును.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతిమత్వానసజ్జతే. 28.

హే మహాబాహో- ఓయి అర్జునుడా; గుణకర్మ విభాగయోః, గుణ- సత్వాది గుణముల యొక్క; కర్మ- వానికర్మముల యొక్కయు; విభాగయోః-వేర్పరచుటయందు; తత్త్వవిత్తు-యథార్థమును దెలిసినవాడయితే; గుణాః- ఇంద్రియములు; గుణేషు-విషయములయందు; ప్రవర్తంతే-ప్రవర్తించుచున్నవి;

ఇతి-ఇట్లని; మత్వా-తలంచి; నసజ్జతే- ఆసక్తుడుకాడు.

అర్జునా! ఈ గుణములను కర్మములను విభజించి తెలుసుకొన్నవాడుమాత్రము కర్మరూపములయిన గుణములను విషయరూపమయిన గుణములయందు వర్తించుచునని తెలిసి తాను కొంచమైనను సంబంధింపక యుండును.

ప్రకృతేర్గుణ సంమూఢా స్సజ్జతే గుణ కర్మసు।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్.

యః-ఎవ్వరు; ప్రకృతేః-మాయయొక్క; గుణసమ్మూఢాస్సంతః, గుణ- సత్వాదిగుణములచేత; సమ్మూఢాస్సంతః- తెలియనివారలై; గుణకర్మసు- ఇంద్రియముల యందును విషయముల యందును; సజ్జతే-ఆసక్తులగుచున్నారో; మందాన్-మందులైన; అకృత్స్నవిదః-సర్వజ్ఞులుకాని; తాన్-వారలను; కృత్స్నవిత్- ఆత్మవేత్త- నవిచాలయేత్- బుద్ధిని చలింపచేయగూడదు.

ఎవరైనే ప్రకృతిగుణముచేత మోహము నొందినవారయి ఆగుణములయొక్క కర్మములందు ఆసక్తులగుదురో అట్టి అనాత్మజ్ఞులయిన మందబుద్ధులకు ఆత్మవేత్తయయినవాడు బుద్ధిభేదము చేయరాదు.

మయిసర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30.

సర్వాణి-సమస్తములయిన, కర్మాణి-కర్మములను; మయి-నాయందు; సన్న్యస్య-ఉంచి; అధ్యాత్మచేతసా- జ్ఞానబుద్ధి చేత; నిరాశీః- నిష్కాముడు; నిర్మమః- మమకారము లేని వాడును; భూత్వా-అయి; విగతజ్వరస్సన్- పోయినసంతాపముగలవాడవై; యుద్ధ్యస్వ-యుద్ధముజేయుము.

ఇక కర్మానులయం దధికృతుడై అజ్ఞానివి నీవు మాకిచ్చ నొందినవాడై ఎట్లు కర్మము జేయువలెననగా నాయందు వివేకబుద్ధిచేత సమస్తకర్మములనుంచి ఆశయును మమకారము ను లేనివాడవయి సంతాపమువిడిచి నీవు యుద్ధముజేయవలెను.

ఏమేమత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః।
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపికర్మభి. 31.

శ్రద్ధావంతః- నావాక్యమందు విశ్వాసముకలిగిన; అనసూయంతః-నాయందసూయ లేని; యేమానవాః-ఏమనుష్యులు; మే-నాయొక్క; ఇదం- ఈఉక్తలక్షణమైన; మతం- అభిప్రాయము ను; నిత్యం- ఎల్లప్పుడు; అనుతిష్ఠంతి- అనువర్తించుచున్నారో; తే-వారలు; కర్మభిః-పుణ్యాపాపకర్మములచేతను; ముచ్యంతే-విడువబడుచున్నారు.

ఎవరైతే ఈనామతమును శ్రద్ధగలవారలయి అసూయ లే

నివారలయి ఎల్లప్పుడు ననుష్ఠింతురో వారలను గూడఁ గర్మలు విడఁచును.

యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్।
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధినష్టా న చేతసః. 32.

యేతు-ఎవ్వరైతే; ఏతత్-ఈ; మే-నాయొక్క; మతం-అభిప్రాయమును; అభ్యసూయంతః- అసూయగలవారలయి; నానుతిష్ఠంతి- అనువర్తించరో; అచేతనః- అవివేకులయిన; సర్వజ్ఞానవిమూఢాన్- సమస్తజ్ఞానములయందునుమిక్కిలి మూఢులయిన; తాన్-వారలను; నష్టాన్-చెడినవారలనుగాను; విద్ధి- తెలియుము.

ఎవరైతే అసూయగలవారలయి ఈ నామతమునుఅనుష్ఠింపరో వారలు సర్వవిషయములయిన జ్ఞానములందును మూఢులనియు అవివేకులనియు నాశమునొందుదురనియు తెలియుము.

సదృశంచేష్టతేస్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33.

జ్ఞానవానపి-జ్ఞానముకలవాడైనను; స్వస్యాః- స్వకీయమైన; ప్రకృతేః- జన్మాంతరసంసారమునకు; సదృశం-సమానమగానట్లు; చేష్టతే-ప్రవర్తించుచున్నాడు; భూతాని- సమస్తప్రాణులు; ప్రకృతిః-స్వభావమును; యాంతి- అనుభవించుచున్నారు; అం

దువలన, నిగ్రహః- ఇంద్రియనిగ్రహమును నాజ్ఞయును; కింక రిష్యతి-ఏమిచేయగలదు; (ఏమియు చేయజాలదని యర్థము.)

ఎందువల్లనగా నామతమునుఅనువర్తింపరనగాపండితుడు కూడా పూర్వజన్మలబ్ధమయిన సంసారమున కనుకూలముగా నేవర్తించును. సమస్తభూతములును ఆ సంస్కార రూపమైన ప్రకృతినే ఆశ్రయించియుందురు. కాబట్టి ఆ ప్రకృతిని నిగ్రహించుట అసాధ్యము.

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌహ్యస్య పరిపంథినౌ. 34.

రాగద్వేషౌ-ఇష్టమందు ప్రీతియు ననిష్టమందు ద్వేషమును; ఇంద్రియస్యేంద్రియస్య-ప్రతీంద్రియమునొక్క; అర్థే- శబ్దాది విషయములయందు- వ్యవస్థితౌ-ఉన్నవి; ఆ కారణమువలన, తయోః-ఆరాగద్వేషములకు; వశం- అధీనత్వమును; నాగచ్ఛేత్-పొంద కూడదు; హి-ఏకారణమువలన; అస్య-ఈపురుషునికి;తౌ-ఆరాగద్వేషములు; పరిపంథినౌ- శ్రేయోమార్గమునకు విఘ్నకర్తలు గనుక శత్రువులోః

ఇక పురుషుడు ఏమిచేయవలెననగా సర్వేంద్రియములకొక్క విషయములందును రాగద్వేషములు సిద్ధముగా నున్నవి.

పురుషునికదియే శత్రువులు గావున అతడు వాని వశమున పడ గూడదు.

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35.

స్వనుష్ఠితాత్ - లెస్సగానాచరింపబడిన; పరధర్మాత్ - స్వవ్యతిరిక్త వర్ణాశ్రమాచార ధర్మమునకంటె; విగుణః-గుణములేనిదైనను; స్వధర్మః-స్వధర్మమె; శ్రేయః-శ్రేష్ఠము; స్వధర్మే-తనధర్మమందు; నిధనం-మరణమైనను; శ్రేయః-శ్రేష్ఠము; పరధర్మః-స్వేతరధర్మము భయావహః- నరకపతనాది భయమును బొందించునట్టిది.

చక్కగా ననుష్ఠింపబడిన పరధర్మము కన్నను గుణము లేనిదైనను స్వధర్మమే మేలు, స్వధర్మము నందు మరణము నొందుటయుమేలే, ఏలయనగాపరధర్మము జేయనధర్మము కలుగును

అర్జున ఉవాచ.

అథ కేన ప్రయుక్తోయం పాపంచ రతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాది వనియోజితః. 36.

హే వార్ష్ణేయ- ఓశ్రీ కృష్ణస్వామీ;అథ-పిమ్మట;అయం పూరుషః- ఈపురుషుడు; అనిచ్ఛన్నపి- పాపముచేయనిచ్ఛయిం

భినవాడయినను; బలాత్-బలాత్కారమువలన; నియోజిత ఇవ-భృత్యునివలె; కేన- ఏహేతువుచేత; ప్రయుక్తస్సన్- ప్రేరేపించబడినవాడగుచు; పాపం-దుష్కర్మమును; చరతి- ఆచరించుచున్నాడు.

అర్జునుడు అడుగుచున్నాడు.— ఓకృష్ణా! పురుషుడు తనకు చేయకబోయినను నిర్బంధముచే ప్రేరేపింపబడినట్లు పాపము చేయుచున్నాడే అట్లు ఇతని ప్రేరేపించునది ఏది.

శ్రీభగవానువాచ.

కామఏష క్రోధఏష రజోగుణ సముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్, 37.

ఏషః- నీచేత నడగబడిన ఈహేతువు; రజోగుణ సముద్భవః- రజోగుణమువలన బుట్టిన; కామః-కోరిక; ఏషః-ఈకామమె, క్రోధః- ఒకానొకనిచేత గొట్టబడినదై క్రోధరూపముగా బరిణమించుచున్నది, మరియు నెట్టిదనిన; మహాశనః-అధికమైన భక్షణముగలిగినదియు; మహాపాప్మా- మిక్కిలి పాపస్వరూపమైనదియు కావున, ఏనం-ఈకామమును; ఇహ-ఈమోక్షమార్గమందు; వైరిణం-శత్రువునుగా; విద్ధి- తెలియుము.

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు.—ఈరజోగుణముచె పుట్టునట్టి ఈ కామమే క్రోధముగా పరిణమించును. అది గొప్ప

పాపముగలది. అట్టికామమే పురుషునకు ఈ సంసారమునందు శత్రువని యెఱుంగుము.

ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేనచ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్. 38.

యథా-ఏప్రకారముగా; ధూమేన-సహజమైనపొగచేత; వహ్నిః-అగ్ని; ఆవ్రియతే-కప్పబడుచున్నదో; యథా-ఏరీతిగా; మలేన-మాలిన్యముచేత; ఆదర్శశ్చ-అద్దమును; ఆవ్రియతే-కప్పబడుచున్నదో. యథా-ఏరీతిగా; ఉల్బేన-మావిచేత; గర్భః-గర్భము; ఆవృతః-కప్పబడెనో; తథా-ఆరీతిగా; తేన-ఆకారణముచే; ఇదం-ఈజ్ఞానము; ఆవృతం-కప్పబడెను.

పొగచేతనెట్లు అగ్నికప్పబడునో, ఎట్లు మురికిచేత అద్దము గప్పబడునో, ఎట్లు మావిచేత శిశువు గప్పబడునో అట్లు కామముచేత జ్ఞానము కప్పబడియున్నది.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేనచ. 39.

హే కౌంతేయ-ఓ యర్జునుడా; దుష్పూరేణ-నిండింపనశక్యమైనదియును; అనలేన-చాలిమిలేనిదియును; కామరూపేణ-ఇచ్ఛారూపమైనదియును; జ్ఞానినః-జ్ఞానికి; నిత్యవైరిణా-నిత్య

తశత్రువయిన; ఏతేన- ఈకామముచేత; జ్ఞానం- జ్ఞానము; ఆవృతం-కప్పబడెను.

అర్జునా! జ్ఞానికి నిత్యశత్రువైనదియు ఎప్పటికిని పూర్ణము సేయరానిదియు తృప్తిలేనిదియు అగు ఈ కామము చేత జ్ఞానము కప్పబడియుండును,

ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతైర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 40.

ఇంద్రియాణి- ఇంద్రియములును; మనః-మనస్సును; బుద్ధిః- బుద్ధియు; అస్య- ఈకామమునకు; అధిష్ఠానం- ఆశ్రయమని; ఉచ్యతే - చెప్పబడుచున్నది; ఏషః- ఈకామము; ఏతైః- ఈ ఇంద్రియములచేత; జ్ఞానం-జ్ఞానమును; ఆవృత్య- కప్పి; దేహినం- దేహముగలవానిని; మోహయతి-నానాప్రకారముగా మోహింప జేయుచున్నది.

ఇంద్రియములును, మనస్సు- బుద్ధియు ఈ కామమునకు అధిష్ఠానముగా చెప్పబడును. ఈ కామము ఈ ఇంద్రియములచే జ్ఞానము నాచ్ఛాదించి పురుషుని మోహపెట్టును.

తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనం. 41.

హే భరతర్షభ- ఓయి అర్జునుడా; తస్మాత్ -ఆ కారణము

వలన; త్వం-నీవు; ఆదౌ-తొలుత; ఇంద్రియాణి-పంచేంద్రియములను; నియమ్య-నిగ్రహించి; జ్ఞాన-ఆత్మజ్ఞానమును; విజ్ఞాన-అనుభవజన్యజ్ఞానమును; నాశనం-నశింపజేయునదియును; పాప్మానం-పాపస్వరూపమైన; ఏనం-ఈకామమును-ప్రజహిహి-లెస్సగావిడువుము.

అందువలన ఓఅర్జునా! నీవు మొదట యింద్రియములన్ని గ్రహించుకొని పాపిష్ఠమైనదియు జ్ఞానవిజ్ఞానముల నశింపచేయునదియు నగు ఈ కామమును విడువుము.

ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరంమనః।
మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తుసః. 42.

పండితాః-జ్ఞాననిష్ఠులు; ఇంద్రియాణి-శ్రోత్రాదీంద్రియములను; పరాణి-దేహములకంటె శ్రేష్ఠములయినవని; ఆహుః-చెప్పుదురు; తథా-అప్రకారముగానే; మనః-మనస్సు; ఇంద్రియేభ్యః-ఇంద్రియములకంటె; పరం-ఉత్కృష్టమయినది, బుద్ధిః-నిశ్చలాత్మకబుద్ధి; మనః-మనస్సుకంటె; పరా-ఉత్కృష్టమైనది; యస్తు-ఏది శ్రేష్ఠమైనదో; బుద్ధేః-బుద్ధికంటె-పరతస్తు-వ్యతిరిక్తమయిన సాక్షిత్వముచేతనున్నదో, సః-అదేపరమాత్మ.

ఈ స్థూలదేహము కన్నను ఇంద్రియములు శ్రేష్ఠమని చెప్పుదురు. ఇంద్రియముల కన్నను మనస్సు గొప్పది. మనస్సు

కన్నను బుద్ధి గొప్పది. ఆ బుద్ధి కన్నను ఆ బుద్ధిసాక్షియైన ఆత్మ గొప్పవాడు.

ఏవంబుద్ధేః పరంబుధ్వా సంస్తభ్యా త్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

హే మహాబాహో– ఓయి అర్జునుడా; ఏవం–ఈప్రకారముగా– బుద్ధేః-బుద్ధికంటె; పరం– వ్యతిరిక్తుడయిన; ఆత్మానం-ఆత్మను; జ్ఞాత్వా– ఎఱిగి; ఆత్మనా– తనచేత; ఆత్మానం– మనస్సును; సంస్తభ్య– లెస్సగానను గ్రహించి; దురాసదం– దుఃఖముచేతబొందదగిన; కామరూపం–కామస్వరూపమైన; శత్రుం– శత్రువును; జహి–చంపుము.

ఓ అర్జునా! ఈవిధమున నీవు బుద్ధికన్నను అగుపడని ఈ యాత్మను తెలుసుకొని బుద్ధిచేతనె ఆత్మను నిశ్చలము జేసుకొని ఈ తెలియరాని యట్టి కామము అను శత్రువును సంహరింపుము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే,
కర్మయోగో నామ తృతీయోధ్యాయః.

ఓం తత్సదితి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య బ్రహ్మానంద సరస్వతీశిష్య రామచంద్రానంద సరస్వతీ విరచితాయాం,

భగవద్గీతావ్యాఖ్యాయాం పదయోజనీసమాఖ్యాయాం
కర్మ యోగో నామ తృతీయోఽధ్యాయః.

ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీ కృష్ణార్జునులసంవాదరూపంబయిన
శ్రీ భగవద్గీతల యందు కర్మయోగ మనెడి
తృతీయాధ్యాయము ముగిసినది.

---

శ్రీ ర స్తు.

శ్రీ భ గ వ ద్గీ తా ప్రా రం భః.

శ్రీ భగవాన్ ఉవాచ.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవే బ్రవీత్. 1.

అహం- నేను; అవ్యయం- నాశరహితమయిన; ఇమంయో
గం- ఈయోగమును; వివస్వతే- సూర్యుని కొఱకు; ప్రోక్త
వాన్- చెప్పినవాఁడనైతిని; వివస్వాన్- ఆసూర్యుఁడు; మనవే-
ఆ సూర్యుని కొమారుడయిన వైవస్వత మనువు కొఱకు; ప్రా
హ-చెప్పెను; మనుః-ఆమనువు; ఇక్ష్వాకవే-ఇక్ష్వాకుకొఱకు;
అబ్రవీత్ -చెప్పెను.

భగవంతుడు చెప్పుచున్నాడు.— నాశములేని ఈ యోగ విద్యను సూర్యునకు నేనుపదేశించితిని. సూర్యుడు తనకునూరుడైన వైవస్వతమనువునకునుపదేశించెను. వైవస్వతమనువు ఇక్ష్వాకు మహారాజున కుపదేశించెను.

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।
సకాలేనేహ మహతా యోగోనష్టః పరంతప. 2.

హేపరంతప-ఓయిఅర్జునుడా; రాజర్షయః-నిమిప్రభృతిరాజర్షులు; ఏవం- ఈప్రకారముగా; పరంపరాప్రాప్తం- పారంపర్యముచేత బొందఁబడిన; ఇమం- ఈయోగమును; విదుః- ఎఱుంగుదురు; మహతా- అధికమయిన; కాలేన- కాలముచేత; ఇహ-ఈలోకమందు; సయోగః-ఆయోగము; నష్టః- విచ్ఛిన్నసంప్రదాయమువలన నశించెను.

ఈ తెఱంగున బరంపరగా నుపదేశింపఁబడిన ఈ యోగవిద్యను రాజర్షులు దెలుసుకొనిరి. చాలా కాలమయినందునను యోగవిద్య యీ లోకమున నాశమునొందెను.

సఏవాయం మయాతేద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోసిమే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమం. 3.

మయా-నాచేత; అద్య-ఇప్పుడు; పురాతనః-పూర్వమందున్న; సఏవాయంయోగః- ఆ ఈ యోగమే; తే-నీకొఱకు;ప్రో

క్తః-చెప్పబడెను; త్వం-నీవు; మే-నాకు; భక్తశ్చ-భక్తుడవును; సఖాచ-చెలికాడవును; అసి-అయితివి; ఇతి-ఇది; రహస్యం-గోప్యమైనది; హి-ఏకారణమువలన; ఏతత్-ఈజ్ఞానము; ఉత్తమం-శ్రేష్ఠమైనదో.

అర్జునా! నీవు నా భక్తుడవు, నా స్నేహితుడవు కాబట్టి, మిగుల రహస్యమయినదియు, నుత్తమమయినదియు నగు నీ యోగవిద్యను నీకు విశదముగా నుపదేశించితిని.

అర్జున ఉవాచ.

అపరంభవతోజన్మ పరంజన్మ వివస్వతః।
కథమే తద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి. 4.

భవతః-నీయొక్క; జన్మ-పుట్టువు; అపరం-ఇప్పుడు; వివస్వతః-సూర్యునియొక్క; జన్మ-జన్మము; పరం-మునుపు; ఆదౌ-స్వర్గాదియందు; త్వం-నీవు; ప్రోక్తవానసీతియత్- చెప్పితివను నది యేదికలదో; ఏతత్- దీనిని; కథం- ఎట్లు; విజానీయాం-తెలియుదును.

సూర్యుని పుట్టుక పూర్వము గలిగినది. నీవు వెనుక గలిగిన వాఁడవు. అట్లుండగా నీ వీ యోగవిద్యను సూర్యునికుపదేశించితివనియే నెట్లు నేఱుంగుదును.

శ్రీ భగవానువాచ.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప. 5

హే అర్జున- ఓయి అర్జునుడా; మెచ- నాకును; తవచ-నీకును; బహూని- అనేకములయిన; జన్మాని- జన్మములు; వ్యతీతాని- అతిక్రమించినవి; సర్వాణి- సమస్తములయిన; తాని- ఆజన్మములను; అహం-నేను; వేద- యెఱుఁగుదును; హేపరంతప- ఓయి అర్జునుడా; త్వం- నీవు; నవేత్థ- ఎఱుఁగవు.

ఓ అర్జునా! నాకును, నీకును, యిదివఱకు, అనేక జన్మములు అయినవి, వాటినన్నిటిని నేను ఎఱుఁగుదును నీవుఎఱుఁగవు.

అజోపిసన్న వ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్
ప్రకృతిం స్వామ ధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా.

అహం- నేను; అజోపిసన్- పుట్టుకలేనివాడనై; అవ్యయాత్మాసిసన్- నాశరహితమైన స్వభావము కలవాడనయి; భూతానాం- బ్రహ్మాది సమస్త భూతములకు; ఈశ్వరోపిసన్- నియామకుడయినవాడనై; స్వాం- స్వకీయమైన; ప్రకృతిం- త్రిగుణాత్మకమయిన మాయను; అధిష్ఠాయ- వశము జేసుకొని; ఆత్మమాయయా- తనమాయచేత; సంభవామి- అవతరించుచున్నాను.

నేను పుట్టనివాడను, అవికారుడను, ప్రాణులకు నియామకుడను, అయినను, నాదైన ప్రకృతిని, యవలంబించి, నా మాయవలన పుట్టుచున్నాను.

యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్. 7

హే భారత– ఓ అర్జునుడా; యదాయదా– ఎప్పుడెప్పుడు; ధర్మస్య– వర్ణాశ్రమోచిత ధర్మమునకు; హానిః– నాశనము; భవతి– అవుచున్నదో; అధర్మస్య– అధర్మమునకు; అభ్యుత్థానం–అభివృద్ధియు; భవతి– అగుచున్నదో; తదాతదా– అప్పుడప్పుడు; అహం– నేను; ఆత్మానం– నన్ను; సృజామహి– మాయచేత పుట్టించుచున్నాను గదా.

ఓయి భారత ఏ ఏ కాలమున ధర్మమునకు హానికలుగునో, అధర్మమునకు వృద్ధికలుగునో అప్పుడెల్ల నేనువచ్చుచున్నాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే. 8

సాధూనాం– సన్మార్గప్రవర్తకుల యొక్క; పరిత్రాణాయ–రక్షణ కొఱకును; దుష్కృతాం– పాపాత్ముల యొక్క; వినాశాయచ– నాశనము కొఱకును; ధర్మసంస్థాప నార్థాయ– ధర్మము నిలుపుట కొఱకును; యుగేయుగే– ప్రతియుగమందును; సంభ

నామి- అవతరించుచున్నాను.

మఱియు శిష్టపరిపాలన, దుష్ట నిగ్రహం, ధర్మసంరక్షణ, కొఱకు, ప్రతియుగమున అవతరించుచున్నాను.

జన్మ కర్మచమే దివ్య మేవంయో వేత్తితత్త్వతః।
త్యక్త్వాదేహం పునర్జన్మ నైతిమామేతి సోర్జున. 9

హే అర్జున- ఓయర్జునుడా; యః- ఎవ్వడు; దివ్యం-అప్రాకృతమైన; మె-నాయొక్క; జన్మ- మాయరూపమైన జన్మమును; కర్మచ- సాధురక్షణాది కర్మమును; ఏవం- ఈ చెప్పబడిన ప్రకారముగా; తత్త్వతః- యథార్థము వలన; వేత్తి- ఎఱుంగుచున్నాడో; సః- ఆపురుషుడు; దేహం- ఈ శరీరమును; త్యక్త్వా-విడిచి; పునః- తిరిగి; జన్మ-జన్మమును; నైతి-పొందడు; (మరియు నేమన్నను) మాం-నన్ను; ఏతి-పొందును.

ఓ అర్జునా! ఎవడైతే నా అప్రాకృత జన్మమును, కర్మను, నిశ్చయముగా తెలియుచున్నాడో వాడు ఈ శరీరమును విడిచిన పిదప మరల జన్మమునుపొందడు, నన్నే పొందుచున్నాడు.

వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవోజ్ఞాన తపసా పూతామద్భావమాగతాః. 10

వీతరాగ భయ క్రోధాః, వీత- పోగొట్టబడిన, రాగ- అనురాగమును, భయ-భయమును, క్రోధాః- క్రోధమునుగలిగిన

ట్టి; మన్మయాః- నా స్వరూపులయిన; మాం- నన్ను; ఉపాశ్రితాః- ఆశ్రయించినట్టి; బహవః- అనేకులయిన సత్పురుషులు; జ్ఞానతపసా- జ్ఞానమనెడి తపస్సుచేత; పూతాస్సంతః- పరిశుద్ధులయినవారలయి; మద్భావనం- నా స్వరూపమును; ఆగతాః- సాక్షాత్తుగా పొందిరి.

అనురాగమును, భయమును, క్రోధమును విడిచిన వారై నా స్వరూపులై నన్ను ఆశ్రయించినట్టి సత్పురుషులు జ్ఞానయోగము చేత పరిశుద్ధులై నా స్వరూపమును పొందినారు.

యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 11

హే పార్థ- ఓ యర్జునుడా; యథా- యే ప్రకారముగా, యే- ఎవరు; మాం- నన్ను, ప్రపద్యంతే- తెలియుచున్నారో; అహం- నేను; తాన్- వారలను; తథైవ-ఆలాగుననే; భజామి- అనుగ్రహించుచున్నాను; మనుష్యాః- మనుష్యులు; సర్వశః- సర్వప్రకారముల చేత; మమ-నాయొక్క; వర్త్మ- మార్గమును; అనువర్తంతే- అనుసరించుచున్నారు.

ఓ యర్జునుడా ఎవరెవరు ఏ ఏ రీతిగ నన్ను తెలియుచున్నారో, వారి వారిని, ఆయా ప్రకారములుగ నేను అనుగ్రహించుచున్నాను. గాన ఎల్ల వారలును నామార్గమునే సర్వప్రకార

ములచేత అనుసరించుచున్నారు.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః।
క్షిప్రంహి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. 12

కర్మణాం- కర్మములయొక్క; సిద్ధిం- ఫలసిద్ధిని, కాంక్షంతః- కోరుచుండెడి జనులు; ఇహ- ఈ లోకమందు; దేవతాః- ఇంద్రాది దేవతలను; యజంతె- సేవించుచున్నారు; హి- ఏ కారణమువలన; మానుషే- మనుష్య సంబంధమైన; లోకే- లోకమందు; కర్మజా-కర్మమువలనబుట్టిన; సిద్ధిః-ప్రాప్తి; క్షిప్రం- శీఘ్రముగా; భవతి- అగుచున్నదో.

ఈ ప్రపంచమునందు మనుష్యులు ఫలాపేక్షతో ఇంద్రాది దేవతలను కొలుచుచున్నారు. ఈ మానుషలోకమున కర్మఫలము త్వరలో లభించుచున్నది.

చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః।
తస్య కర్తార మపిమాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

మయా- నాచేత; చాతుర్వర్ణ్యం- బ్రహ్మ క్షత్రియాది వర్ణ చతుష్టయము; గుణకర్మ విభాగశః- గుణ సత్త్వాది గుణములయొక్కయు; కర్మ- తపశ్శమాది కర్మములయొక్కయు; విభాగశః- విభజనగా; సృష్టం- సృజింపబడెను; తస్య- ఆ కర్మమునకు; కర్తారమపి- కర్తనైనను; మాం- నన్ను; అకర్తారం- క

కర్తగానివానినిగా; అవ్యయం- నాశరహితునిగా; విద్ధి- తెలియుము.

సత్త్వాది గుణములు, కర్మలు, వీట్ల భేదములచేత నాలుగు వర్ణములు నాచే సృజింపబడినవి. ఆ నాల్గువర్ణములకు, నేను కర్తనైనను, అవికారుణ్ణిగనుక, నన్ను కర్తగాని వానిగా తెలియుము.

నమాం కర్మాణి లింపంతి నమే కర్మ ఫలేస్పృహా।
ఇతిమాంయో౽భిజానాతి కర్మభి ర్నసబధ్యతే. 14

కర్మాణి- సృష్ట్యాదికర్మములు; మాం-నన్ను; నలింపంతి-అంటవు; మె-నాకు; కర్మఫలే-కర్మఫలమందు; స్పృహా-ఇచ్ఛ; నః- లేదు; ఇతి-ఈ ప్రకారముగా; మాం-నన్ను; యః-ఎవ్వడు; అభిజానాతి-ఎఱుఁగుచున్నాడో; నః-వాడు; కర్మభిః-కర్మములచేత; నబధ్యతె- కట్టువడడు.

కర్మలు నన్ను అంటవు, కర్మసిద్ధియందు నాకు ఆసక్తిలేదు ఈ విధముగా నన్ను తెలిసికొన్న జ్ఞానిని కర్మఫలములు కట్టజాలవు.

ఏవం జ్ఞాత్వా కృతః కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురుకర్మై వత స్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం.

ఏవం- ఈ ప్రకారముగా; జ్ఞాత్వా- యెఱిగి; పూర్వైః- పూర్వీకులయిన; ముముక్షుభిరపి- మోక్షాపేక్షగలవారల చేత ను; కర్మ-కర్మము; కృతం-చేయబడెను;తస్మాత్ -ఆకారణమువ లన; త్వం- నీవు; పూర్వైః- పూర్వీకులయిన జనకాదుల చే త; కృతం- చేయబడిన; పూర్వతరం- పురాతనమైన; కర్మైవ- కర్మమునే; కురు- చేయుము.

ఈ విధముగా దెలిసికొని ముముక్షువులయిన పూర్వీకులచే త కర్మ చేయబడినది గాన నీవును పూర్వీకులచే అనాదిగజే యబడిన కర్మమును జేయుము.

కిం కర్మ కిమ కర్మేతి కవయో ప్యత్ర మోహితాః।
తత్తేకర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్.

కర్మ- కర్మము; కిం-ఎట్టిది; అకర్మ- అకర్మము; కిం-ఎట్టి ది; అత్ర- ఈ కర్మజ్ఞాన విషయమై; కవయోపి- బుద్ధిమంతులు ను; మోహితాః- మోహమును బొందిరి; (ఆకారణమువలన) తే- నీ కొఱకు; తత్ - ఆ; కర్మ- కర్మమును; అకర్మ- అకర్మ మును; ప్రవక్ష్యామి- తెల్లగాజెప్పెదను; యత్ - ఏకర్మాకర్మ ములను; జ్ఞాత్వా- తెలిసి; అశుభాత్- సంసారమువలన; మో క్ష్యసే- ముక్తుఁడవు కాగలవో,

కర్మ యెట్టిది అకర్మ యెట్టిది, అను నీ సంశయమునందు బుద్ధి మంతులుకూడా మోహమును జెందిరి. ఆ కర్మాకర్మలయొక్క విషయమును నీకుగాను చెప్పుచున్నాను. దానిని తెలిసికొనిన, నీవు క్షేమము పొందగలవు.

కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచవికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః. 17

కర్మణః- శాస్త్రవిహితమయిన కర్మముయొక్క; తత్త్వం- యథార్థము; బోద్ధవ్యం- తెలియదగినది; అస్తి- కలదు; వికర్మణోపి- నిషిద్ధ కర్మముయొక్కయు; తత్త్వం-యథార్థము; బోద్ధవ్యం- తెలియదగినది, అస్తి-కలదు; అకర్మణః- కర్మ; రహితతూష్ణీం- భావముయొక్కయు; తత్త్వం-యథార్థము బోద్ధవ్యం- తెలియదగినది; అ_-కలదు; హి- ఏ కారణమువలన; కర్మణః- కర్మాకర్మ వికర్మములయొక్క; గతిః- యథార్థగతి; గహనా- తెలియనశక్యమయినదో,

కర్మ యిది యనియు, నిషిద్ధకర్మ ఇదియనియు, కర్మాభావము యిది యనియు, ఈమూడుస్థితులను, చక్కగా తెలియవలయును, ఈ కర్మాకర్మ వికర్మల యథార్థస్థితి తెలియుట యశక్యము.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మయః।
సబుద్ధిమా న్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్.

యః- ఎవడు; కర్మణి- వ్యాపారమాత్ర కర్మమందు; అకర్మ- కర్మ లేకపోవుటను, అనగా నింద్రియవ్యాపార సద్భావమందు సాక్షియైన తనకు అకర్తృత్వమును; పశ్యేత్- చూచునో; యః- ఎవ్వడు; అకర్మణిచ- కర్మాభావమందును; కర్మ- బ్రహ్మము తెలియబడుచుండగా జేయఁ దగిన కర్మము చేయుబడెనని; పశ్యేత్- చూచునో; సః- వాడు; మనుష్యేషు- మనుష్యులయందు; బుద్ధిమాన్- నిశ్చయాత్మక బుద్ధిగలవాడు; సః- వాడే; కృత్స్న కర్మకృత్- సమస్త కర్మముల జేసిన వాడును; యుక్తః- యోగియు; భవేత్- అగును; బ్రహ్మవిచారమందు నిశ్చల మనస్సు గలవాడు, సకల కర్మముల నాచరించిన వాడగునను నీ విషయమై పండితకృతంబగు నొక శ్లోకమిచట జేర్చబడినది. " శ్లో. స్నాతం తేన సమస్తతీర్థ సలిలే దత్తం మహీ మండలం। విప్రేభ్యః పితృదేవతా స్సురగణా న్సర్వేషు సంతర్పితాః। జప్తా మంత్ర సహస్రకోటి రమునా తప్తంచ తీవ్రంతపో। యస్య బ్రహ్మవిచారణే క్షణమపి ప్రాప్నోతి స్థైర్యం మనః. " మఱియు కర్మణ్యకర్మ అనెడు శ్లోకమునకీ చెప్పబడిన యర్థము గాక మఱికొంత

యర్థముగలదు అది యెట్లులనిన, భగవత్ప్రీతిగాఁజేయబడిన నిత్య కర్మములకు బంధహేతుత్వము లేదు గావున నవి యకర్మములని చెప్పబడుచున్నవి ఆ నిత్యకర్మములు చేయక పోవుట యకర్మను ఆయకర్మమునకు ప్రత్యవాయమే ఫలమగుట వలన నది యాప్రత్యవాయ ఫలకర్మమని చెప్పబడుచున్నది. అనఁగా నకర్తా కర్మములలో ఫలములేని నిత్యకర్మమందు అకర్మము నెవ్వడు చూచునో వాడును నిత్యకర్మములచేయని పక్షమందు ఆయకర్మమందు గర్మము వరకముఖ్య ప్రత్యవాయ ఫలము నిచ్చునని యెవ్వడు చూచునో వాడును అని చెప్పిన వ్యాఖ్యాన మస్మదంగీకృతంబుగాదు గావున దొలుత మేము చెప్పిన యర్థమే యుక్తము.

కర్మయందు కర్త్రాభావమును ఎవడు తెలిసికొనుచున్నాడో కర్త్రాభావమునందు కర్మను ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు మనుష్యులలోన బుద్ధిమంతుడు వాడే యోగి వాడే యెల్ల కర్మలు చేసినవాడు.

యస్యసర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః. 19

యస్య- ఏ యదోక్త దర్శియైనవాని యొక్క; సర్వే- సమస్తములయిన; సమారంభా- కర్మములు; కామసంకల్పవర్జి

తాః- కోరబడిన సంకల్పములేనివి; భవంతి- అగుచున్నవో; బుధాః-బ్రహ్మవేత్తలు; జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం- జ్ఞానమను నగ్నిచేత దహించబడిన సకలశుభాశుభకర్మములుగలిగినట్టి; తం-ఆ పురుషుని; పండితం- పండితునిగా; ఆహుః- చెప్పుదురు.

ఎవని కర్మలైతే కామ సంకల్పములు కావో యెవని కర్మలుజ్ఞాన మనే నిప్పుచే కాల్పబడినవో అట్టివానిని పండితుడని విద్వాంసులు చెప్పుదురు.

త్యక్త్వాకర్మ ఫలా సంగం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభి ప్రవృత్తోపి నైవ కించి త్కరోతిసః. 20

కర్మ ఫలాసంగం- కర్మ కర్తృత్వాభి మానమును;త్యక్త్వా-విడిచి; నిత్యతృప్తస్సన్, నిత్య- నియతమును; తృప్తస్సన్- (విషయములయందును కర్మఫలమునందును కర్తృత్వాభిమాన కాంక్షలేక జ్ఞానము చేత) తృప్తుడయిన వాడగుచు;నిరాశ్రయస్సన్- నిరాశ్రయుడయిన వాడగుచు; కర్మణి-కర్మమందు; అభిప్రవృత్తోపి- ప్రవర్తించినవాడయ్యును; సః- వాడు; కించిదపి- కొంచమైనను; నకరోత్యేవ- చేయునివాడే.

కర్మఫలాపేక్షను విడిచి, నిత్య తృప్తుడై విషయప్రవృత్తిలేనివాడు కర్మయందు ప్రవర్తించిన వాడయినను అట్టివాడు కర్మచేసినవాడు కాజాలడు.

హ్మ-బ్రహ్మమే; బ్రహ్మాగ్నౌ-బ్రహ్మమనునగ్నియందు; బ్రహ్మణా- కర్తృకర్మరూపమయిన బ్రహ్మముచేత; హుతం- హోమము చేయుడమనే హవనక్రియ; బ్రహ్మైవ- బ్రహ్మమే; తేన-ఆ; బ్రహ్మకర్మసమాధినా- బ్రహ్మమనెడికర్మమందు చిత్తైకాగ్ర్యముచేత; గంతవ్యం- పొందదగినఫలము; బ్రహ్మైవ- బ్రహ్మమే అని తెలిసినవానికి కర్మము లేదు.

యజ్ఞపాత్ర బ్రహ్మమే, హోమద్రవ్యము బ్రహ్మమే, అగ్ని బ్రహ్మమే, హోమము చేయువాడు బ్రహ్మమే, బ్రహ్మకర్మ సమాధిచేత పొందదగిన ఫలము బ్రహ్మమే.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి. 25

అపరే- కొందరైన; యోగినః-యోగులు, (కర్మయోగులనుట) దైవ- దేవతాజన సాధనమయిన; యజ్ఞమేవ- యజ్ఞమునే; పర్యుపాసతే- (ఫలాసక్తిచేత) చేయుచున్నారు; అపరే- మరకొందరయిన జ్ఞానులు; యజ్ఞేనైవ- హవిస్సువాది యజ్ఞసాధనము చేతనే; యజ్ఞం- పరమార్థముతో కూడిన యాత్మను; బ్రహ్మాగ్నౌ- బ్రహ్మమనెడి యజ్ఞవిధానమయిన యగ్నియందు; ఉపజుహ్వతి- హోమము చేయుచున్నారు;

బ్రహ్మాత్మైక నిష్ఠులవి యథార్థము. ఇదిజ్ఞానయజ్ఞము.

కొందరు యోగులు ఫలాసక్తిచే దేవతారాధన సాధనమైన యజ్ఞమునే చేయుచున్నారు. మరికొందరుజ్ఞానులు బ్రహ్మమనేఅగ్నియందు, కర్మమనేహవిస్సును, హోమము చేయుచున్నారు.

శ్రోత్రాదీ నీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీ న్విషయానన్యే పీంద్రియాగ్నిషు జుహ్వతి। 26

అన్యే- మరికొందరయిననైష్ఠికులు; శ్రోత్రాదీని- శ్రోత్రము మొదలయిన, ఇంద్రియాణి- ఇంద్రియములను; సంయమాగ్నిషు- నిగ్రహమనేడి యగ్నులయందు, జుహ్వతి-హోమము జేయుచున్నారు; అన్యే- మరికొందరు; శబ్దాదీన్- శబ్దము మొదలయిన; విషయాన్-విషయములను; ఇంద్రియాగ్నిషు- ఇంద్రియముల నేడి అగ్నులయందు; జుహ్వతి- వేల్చుచున్నారు.

మరికొందరు జ్ఞానేంద్రియములను నిగ్రహమనేనిప్పునందు హోమము చేసి నశింపజేయుచున్నారు. మరికొందరు విషయములను ఇంద్రియములనే నిప్పునందు హోమముజేసినశింపజేయుచున్నారు.

సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయ మయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 27